# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము

సంపుటము 40 | జూన్ 1997 | సంచిక 6

## విషయసూచిక


| | | | | |
|---|---|---|---|---|
| మాతృప్రేమ - దైవానుగ్రహం | - | శ్రీవారి దివ్యబోధ | (6.5.97) | 141 |
| బృందావనంలో బుద్ధపూర్ణిమ | - | | | 146 |
| ''ఏకోహం బహుశ్యాం'' | - | శ్రీవారి దివ్యబోధ | (20.7.96) | 147 |
| శాశ్వతానందప్రాప్తి | - | శ్రీవారి దివ్యబోధ | (22.7.96) | 150 |
| సున్నాల పన్నా | - | వీరుభొట్ల సూర్యనారాయణ | | 153 |
| మూడు తరహాల వ్యక్తులు | - | శ్రీవారి దివ్యబోధ | (23.7.96) | 154 |
| ధర్మం పురుష లక్షణం | - | శ్రీవారి దివ్యబోధ | (24.7.96) | 157 |
| కొడైకెనాల్‌లో శ్రీవారు | - | డా॥ ఆర్. శ్రీరామరాజు | | 160 |
| సత్యోపనిషత్ | - | ప్రొ॥ కామరాజు అనిల్‌కుమార్ | | 161 |
| రాగమే రోగము, విరాగమే నిర్వాణము | - | శ్రీవారి దివ్యబోధ | (15.5.97) | 164 |


ప్రింటర్ అండ్ పబ్లిషర్: పి.కె. సూ[illegible] | ఎడిటర్: వి.కె. నరసింహన్



సంవత్సర చందా: తెలుగు లేక ఇంగ్లీషు (ఒక్క సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడును)

ఇండియాలో: రూ. 30/-

విదేశాలకు: ఎయిర్‌మెయిల్ - రూ.240/- లేక యు.ఎస్.డాలర్లు 8 లేక యు.కె. పౌండ్లు 5

సీ మెయిల్ - రూ.120/- లేక యు.ఎస్.డాలర్లు 4 లేక యు.కె. పౌండ్లు 3

చందా పంపవలసిన చిరునామా: కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్‌కోడ్ - 515134

సాధారణ సమాచారము: (1) చందాదారుని పేరు, పూర్తి చిరునామా పెద్ద అక్షరములతో వ్రాయవలెను. (2) భారత దేశములో ఏ చోటకయినా పత్రిక చందా మనియార్డరు ద్వారాగాని, బ్యాంకు డ్రాఫ్టు ద్వారాగా చెల్లించవచ్చును. (3) క్రొత్త చందాయో లేక రెన్యువల్ చందాయో తెలియపరచవలెను. రెన్యువల్ అయినచో ప్రస్తు చందా నెంబరు వ్రాయవలెను. (4) రెన్యువల్ కోరునప్పుడు చందా గడువు ముగియుటకు రెండు నెలలు ముందు తిరిగి చందా రుసుమును పంపవలెను. (5) ఈ పత్రిక శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టువారి తరఫు శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్‌ప్రెస్, ప్రశాంతినిలయంలో ముద్రించబడినది.

ఫ్యాక్స్: 0091-8555-87236/87390, గ్రామ్స్: 'బుక్‌ట్రస్ట్'

టెలిఫోన్: 87375, STD కోడ్: 08555, ISD కోడ్: 0091-8555

# మాతృప్రేమ - దైవానుగ్రహం

ప్రతి మానవుడు తల్లిగర్భము నుండియే జన్మించుచున్నాడు, తల్లిఆదరణచేతనే అభివృద్ధి నొందుతున్నాడు, తల్లిప్రేమచేతనే సిరిసంపదలను, సర్వసౌఖ్యములను అనుభవిస్తున్నాడు. తల్లి ఇతర విషయములలో ఏమైనా పెడమార్గం పట్టువచ్చునేమోగాని కుమారుని విషయంలో మాత్రం ద్వేషమునుకాని, అయిష్టతనుకాని పొందదు. ఎటువంటి పరిస్థితిలోనైనా కుమారుని యోగక్షేమములనే కోరుతుంది. తల్లి దేహాన్ని అందిస్తుంది, తండ్రి పోషిస్తాడు, గురువు తెలివితేటలను చేకూర్చుతాడు. కనుక ప్రతి వ్యక్తి తన తల్లిదండ్రులను, గురువును ప్రేమించాలి, గౌరవించాలి.

ప్రాచీనకాలంలో అనేకమంది మహనీయులు తల్లిఆశీర్వాదము తీసుకున్న తరువాతనే తమ కర్తవ్యకర్మలను ఆచరించడానికి పూనుకునేవారు. యుద్ధమునకుగాని, తపస్సుకుగాని బయలుదేరే ముందు కుమారుడు తల్లిపాదములపై పడి ఆశీర్వదించుమని ప్రార్థించినప్పుడు,

''తారకాఖ్యాసుత దోర్దర్ప మణచు వేళ
గౌరి తనయుని కిడ్డ వీరరక్ష
శంభరాసుర వీర జంపగా జనువేళ
భార్గవ సుత కిడ్డ భవ్యరక్ష
మాతృదాసీత్వంబు మాన్ప నఱుగు వేళ
వినత పుత్రున కిడ్డ విమలరక్ష
జనకు యానతి పాలింప వనికేగెడున్ వేళ
తల్లి రాఘవు కిడ్డ ధన్యరక్ష
అట్టి శ్రీరక్ష, ధీరక్ష, అంగరక్ష
రక్షలందున దివ్యమౌ రామరక్ష
తోడు నీడయై నిన్ను కాపాడుగాక!''

అని తల్లి ఆశీర్వదించి పంపేది. ఇట్టి ఆశీస్సులచేతనే కుమారులు యుద్ధములో పోరాడి విజయాన్ని సాధించగల్గేవారు, అరణ్యంలో కఠోరమైన తపస్సు చేసి దైవానుగ్రహాన్ని పొందగల్గేవారు. తల్లి ఆశీస్సులు పొందలేనివారు అనేక జన్మల నెత్తవలసి వస్తుందని శంకరులవారు అన్నారు. తల్లిఆశీస్సులు పొందినవారికి పునర్జన్మ లేదని కూడా అన్నారు. కనుక మొట్టమొదట తల్లి యొక్క అనుగ్రహానికి పాత్రులు కావాలి. అయితే ఇది ప్రాకృతమైన జీవితానికి మాత్రమే సంబంధించినది. ఆధ్యాత్మిక మార్గంలో వేదాంతము మరొకవిధంగా బోధించింది. ''నాయనా! నీ హృదయ మనేది సింగిల్ చైర్. ఇది డబుల్ సోఫా కాదు, మ్యూజికల్ చైర్ కాదు. కనుక ఇందులో ఒక్క భగవంతునికి మాత్రమే చోటివ్వు. అయితే తల్లిదండ్రులను ప్రేమించు, వారికి తగిన కృతజ్ఞత నందించు. కాని వారు శాశ్వతం కాదు''

'మాతా నాస్తి పితా నాస్తి, నాస్తి బంధు సహోదరః
అర్థం నాస్తి గృహం నాస్తి, తస్మాత్ జాగ్రత జాగ్రత'

ఈ దేహములన్నీ కదలిపోయే మేఘములవంటివి.

నిజమైన మాతృమూర్తి ఒక్క దైవమే. తల్లి గృహవాసి, తండ్రి గృహవాసి, గురువు ఆశ్రమవాసి. దైవ మొక్కడే హృదయవాసి. ఈ సత్యాన్ని గుర్తించాలి. ఈ లోకసంబంధమైన రీతిగా తల్లిని దైవంగా భావించి గౌరవించవచ్చును. కాని, హృదయంలో నిల్పుకోవలసింది ఒక్క భగవంతుణ్ణి మాత్రమే. హృదయంలో ఉండే అర్హత ఒక్క భగవంతునికి మాత్రమే ఉన్నది.

***జడచైతన్యములు :*** దేహము - దేహి, లేక క్షేత్రము - క్షేత్రజ్ఞుడు, లేక శరీరము - శరీరి అనే రెండు తత్త్వములతో కూడినవాడు మానవుడు. శరీర మనగా ఏమిటి? ''శీర్యతీతి శరీరః'' అనగా, జీర్ణించిపోవునది శరీరము. ఇది పెరుగుతూ ఉన్నప్పటికీ జడమైనదే! ఎట్లా? ప్రతి నిత్యము మన గృహమును ఊడ్చి ఆ చెత్తను ఒక గుంతలో వేస్తే కొంతకాలానికి అదొక దిబ్బమాదిరి పెరిగి పోతుంది. అదేవిధంగా మన దేహంలో ఇడ్లీ, దోస, చపాతీవంటి పదార్థాలను ప్రతి దినము వేస్తూ ఉంటే ఇది కూడా దిబ్బమాదిరి పెరుగుతూ పోతుంది. సున్నము, నీరు, సబ్బు, ఇనుము, సీసము మున్నగు జడమైన పదార్థములతో తయారైనది ఈ దేహము. కనుక ఇది జడమైనదే. ఇది పెరుగు తుంది, తరుగుతుంది. కాని దేహి పెరగడు, తరగడు. దేహము - క్షేత్రము, దేహి - క్షేత్రజ్ఞుడు. క్షేత్రమని దేనికి పేరు? దైవత్వమున్న ప్రదేశానికే క్షేత్రమని పేరు. కనుకనే తిరుపతి, అమర్‌నాథ్, బదరీనాథ్ మున్నగువాటిని క్షేత్రములని పిలుస్తాము. ఈ దేహము కూడా ఒక క్షేత్రమే. ఎందుకోసం? ఇందులో భగవంతుడనే క్షేత్రజ్ఞు డున్నాడు. క్షేత్రజ్ఞుని వల్లనే క్షేత్రమునకు విలువ ఉంటుంది. ప్రతి దేహము దేవాలయమేకాని, జీవాలయము కాదు. ఇట్టి దివ్యమైన శక్తితో కూడిన దేహాన్ని అందించి నందులకు తల్లికి మనం కృతజ్ఞులమై ఉండాలి.

***వైజ్ఞానికుల అజ్ఞానం :*** అన్నింటికీ భగవంతుడే మూల కారకుడైనప్పటికీ ఈ దేహానికి మూలాధారం తల్లియే. విత్తనము మంచిదే అయినప్పటికీ దానిని మట్టిలో పెట్టి నీరు పోసినప్పుడే మొలకెత్తుతుంది కాని, టిన్నులో పెడితే మొలకెత్తదు కదా! కాబట్టి ప్రకృతియే తల్లి, పరమాత్ముడే తండ్రి. ప్రకృతీపరమాత్మల సంయోగమువల్లనే జీవతత్త్వము ఏర్పడుచున్నది. ప్రతి దానికి భగవంతుడే మూలాధారం. ఈనాటి సైంటిస్టులు హైడ్రోజన్, ఆక్సిజన్‌లను కలిపి నీటిని సృష్టించామని విఱ్ఱవీగు తున్నారు. కాని అసలు హైడ్రోజన్, ఆక్సిజన్‌లను సృష్టించిం దెవరని ప్రశ్నించుకోవడం లేదు. నీటిని, పాలను వేరు చేయగల శక్తిని భగవంతుడు హంస కిచ్చాడని మన ప్రాచీనులు అంటే ఈనాటి సైంటిస్టులు, ''నాన్సెన్స్! ఇదంతా వట్టి దగా! హంస ముక్కుపైన ఒక యాసిడ్ ఉంది. అదే పాలను, నీటిని వేరు చేస్తుంది'' అంటారు. నిజమే! కాని దాని ముక్కుపైన యాసిడ్‌ను వీరేమైనా తెచ్చి పెట్టారా? ఇది దైవసృష్టి, దైవసంకల్పము. ఇట్టి దైవసంకల్పాన్ని అర్థం చేసుకోలేక కొంతమంది మూర్ఖత్వంతో వాదిస్తారు. ఆధ్యాత్మికాన్ని విమర్శించడం సులభంకాని, అర్థం చేసుకోవడం చాల కష్టం.

***ఆధునిక విద్యార్థికి గుణపాఠం :*** ఒకానొక సమయంలో ఒక పండితుడు తన ఇంటివరండాలో కూర్చుని సంధ్యావందన మాచరిస్తున్నాడు. ఆధునిక విద్యార్థియైన ఆయన మనుమడు కూడా అక్కడే కూర్చుని ఒక ఇంక్‌బాటిల్‌లో మాటిమాటికి పెన్నును అద్దుతూ

హోమ్‌వర్క్ చేసుకుంటున్నాడు. ఈ పండితుడు ఒక టంబ్లర్ నుండి పదేపదే స్పూన్‌తో నీరు తీసుకుంటూ, ''ప్రాణాయస్వాహా, అపానాయ స్వాహా...'' అంటూ సంధ్య వార్చుతున్నాడు. తాతగారు చేస్తున్న పని చూసి మనుమనికి ఆశ్చర్యం కల్గింది. ''తాతగారూ! మీకంత దప్పిగా ఉంటే ఒకేతూరి టంబ్లర్ నెత్తుకొని నీరంతా త్రాగవచ్చు కదా!'' అన్నాడు. తాతగారు నవ్వి, ''నాయనా! నీవు మాటిమాటికి ఆ పెన్నును ఇంక్‌బాటిల్‌లో అద్దడ మెందుకు? ఒకేతూరి ఆ బాటిల్‌లో ఉన్న ఇంక్‌నంతా పేపర్ మీద పోయవచ్చు కదా!'' అన్నాడు. ''అట్లా పోస్తే అక్షరాలు రావు తాతగారూ!'' అన్నాడు మనుమడు. ''అట్లే నేను కూడా ఒక్కొక్కతూరి భగవంతుని పేరు చెప్పి స్పూన్‌తో నీళ్ళు తీసుకొనకపోతే అవి భగవంతునికి చేరవు నాయనా!'' అని తాతగారు సమాధాన మిచ్చాడు. మనం ఎవరికైనా ఉత్తరం వ్రాసినప్పుడు అడ్రస్సు సరిగా లేకపోతే అది డెడ్-లెటర్స్ ఆఫీసుకు పోతుంది. అదేరీతిగా, ''ప్రాణాయస్వాహా, అపానాయస్వాహా...'' అని ఒకదాని తరువాత ఒకటి ''అడ్రస్సు'' సరిగా ఉచ్చరించకపోతే అది పంచప్రాణములకు చేరదు. దైవసంబంధమైన విషయాలలో కొన్ని పద్ధతులను సక్రమంగా అనుసరించినప్పుడే సరియైన ఫలితం వస్తుంది.

***తల్లిదీవెనకు దైవానుగ్రహం తోడు కావాలి :*** ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించడానికి నీ తల్లి నీ కేమైనా అడ్డు చెపితే ఆమెకు చక్కగా అర్థమయ్యేటట్లు సమాధానం చెప్పు. అది నీ కర్తవ్యం. ''నే నింత పెద్దవాడ నయ్యాను. కనుక నేనింక తల్లి నెందుకు గౌరవించాలి?'' అని భావించకూడదు. నీ వెంత పెద్దవాడవైనప్పటికీ నీ తల్లికి కుమారుడవే కదా! ఏ తల్లియైనా తన కొడుకు గొప్ప పేరు పొందాలనీ, దైవాను గ్రహానికి పాత్రుడు కావాలనే ఆశిస్తుంది. కొడుకు తన పాదాలకు నమస్కరించినప్పుడు, ''నాయనా! ఆయురారోగ్యఐశ్వర్యాలతో, శాంతిసౌఖ్యాలతో నిండు నూరేళ్ళు వర్ధిల్లు'' అని ఆశీర్వదిస్తుంది. అయితే ఈ ఆశీర్వాదం ఫలించాలంటే దైవాను గ్రహం కూడా కావాలి. తల్లి ఆశీర్వదించేటప్పుడు భగవంతుడు కూడా, ''తథాస్తు'' అనాలి. లేకపోతే తల్లిఆశీర్వాదము కూడా చెల్లదు. కరెంటు, బల్బు రెండూ ఉన్నప్పుడే వెలుతురు లభ్యమౌతుంది కదా! అదేవిధంగా తల్లిఆశీర్వాదమూ ఉండాలి, దైవానుగ్రహమూ ఉండాలి. ఈ రెండూ కల్గినవారు ఉన్నతస్థితిని పొందగలరు. కనీసం దైవానుగ్రహ మొక్కటి ఉన్నా చాలు, మీరు దేనినైనా సాధించగలరు. కనుక, ఎవరిని నమ్మినా నమ్మకపోయినా దైవాన్ని మాత్రం నమ్మాలి. ఈ లోకంలో ఎవ్వరూ మీకు సుఖశాంతుల నందించ లేరు. తెలుగులో ఒక సామెత చెబుతారు - ''అమ్మకే లేక అటుకులు నాకుతుంటే అల్లుడు దీపాల పండుగకు వచ్చాడట!'' అమ్మకే తినడానికి లేనప్పుడు అల్లుడికేమి పెట్టగలదు? అట్లే, ఈ లోకంలో ఎవ్వరికీ సుఖశాంతులు లేవు. వారికే లేనిది మీ కేమివ్వగలరు? శాంతిస్వరూపుడైన దైవంవద్ద మాత్రమే మీకు శాంతి లభ్యమవుతుంది. కాని కొంతమందికి ఎప్పుడు చూసినా లోక వ్యవహారమే, సంసార చింతలే! ఇంక దైవానుగ్రహం ఏరీతిగా చిక్కుతుంది? అలాంటి వారికి ఎక్కడ పోయినా చింతలు తప్పవు. తల్లి ఎంత గొప్పదై నప్పటికీ కుమారునిపై దైవానుగ్రహమే లేకపోతే

తాను కూడా ఏమీ చేయలేదు. కనుకనే తల్లి కూడా కుమారుని యోగక్షేమముల నిమిత్తమై దైవాన్ని ప్రార్థిస్తుంది.

*శంకరులవారికి దేవీ అనుగ్రహప్రాప్తి:* శంకరాచార్యుల వారి తండ్రి ప్రతి దినము రాజరాజేశ్వరీదేవి పూజ చేసి పాలను నైవేద్యం పెట్టి ఆ ప్రసాదమును తెచ్చి భార్యకు, కుమారునికి అందించేవాడు. ఒకనాడు అతడు ఏదో పనిపై తప్పనిసరిగా ప్రక్కగ్రామానికి వెళ్ళవలసి రావడంచేత తన కుమారుడైన శంకరుని పిలిచి, ''నాయనా! రేపటి దినమున నీవు రాజరాజేశ్వరికి పూజ చేసి పాలను నైవేద్యం పెట్టు. దానిని నీవు, నీ తల్లి తీసుకోవచ్చును'' అన్నాడు. మరునాడు శంకరుడు తండ్రిఆజ్ఞను శిరసావహించి ఒక కప్పులో పాలు తీసుకొని రాజరాజేశ్వరీ విగ్రహం ముందు ఉంచి, ''తల్లీ! దీనిని స్వీకరించు'' అని ప్రార్థించాడు. కాని ఎంతసేపైనప్పటికీ తల్లి రాలేదు, ఆ కప్పులో పాలు ఖర్చు కాలేదు. శంకరుడు అప్పటికి ఆరు సంవత్సరముల పిల్లవాడు. ''తల్లీ! ప్రతి రోజు నా తండ్రి తెచ్చిన పాలను త్రాగుతున్నావు కదా! మరి ఈ రోజు నేను తీసుకొని వస్తే ఎందుకు త్రాగటం లేదు? నేనేం పాపం చేశాను?'' అని చాల బాధపడ్డాడు. కాని తన పట్టు వీడలేదు. ''తల్లీ! నీవీ పాలను త్రాగకపోతే నేను నా తల్లిదండ్రుల మనస్సును కష్టపెట్టిన వాడనవుతాను. తల్లిదండ్రులను సంతృప్తి పర్చలేని నా బ్రతుకెందుకు? కనుక నేను ప్రాణత్యాగం చేస్తాను'' అని శపథం చేశాడు. ఈ అమాయకుడు అన్నట్లుగానే ప్రాణం తీసుకుంటాడేమోనని రాజరాజేశ్వరి ప్రత్యక్షమై, ''నాయనా! నీ భక్తికి మెచ్చాను. ఇదిగో, నీవు తెచ్చిన పాలను త్రాగుతున్నాను. నీ వింక సంతోషంగా ఉండు'' అని పలికి ఆ కప్పులో ఒక్క చుక్కైనా మిగల్చకుండా పాలన్నీ త్రాగివేసింది. శంకరుడు చూశాడు, ''అమ్మా! పాలన్నీ నీవు త్రాగిపోతే నా తల్లికి ప్రసాదంగా ఏమివ్వాలి? అంతా నేనే త్రాగివేశా ననుకుంటుంది. ప్రతి రోజు నా తండ్రి నీవు త్రాగిన పాలను తెచ్చి మాకిచ్చేవాడు. కనుక కొన్ని పాలను నాకు తిరిగి ఇవ్వు'' అన్నాడు. సముద్రంలో కలసిన గంగను తిరిగి వేరుచేయడానికి వీలవుతుందా? ఒకసారి త్రాగిన పాలను ఆమె తిరిగి ఎలా తెచ్చివ్వగలదు? కాని శంకరుడు తనకు కొంచెమైనా పాలను తిరిగి ఇవ్వాలని పట్టుపట్టాడు. లేకపోతే తన తల్లి దగ్గర తనకు చెడ్డపేరు వస్తుందని గట్టిగా వాదించాడు. అప్పుడు రాజరాజేశ్వరి కరుణించి తానే స్వయంగా తన పాలను పిండి అతని కిచ్చింది. ఆ పాలను త్రాగటంచేతనే శంకరులవారు జైత్రయాత్ర చేసి ప్రజలచేత పూజలందుకోగలిగారు. ఆనాటి నుండి అతనికి సమస్త వేదములు, శాస్త్రములు, ఉపనిషత్తులు కరతలామలకము లైనాయి.

*హృదయంలో దైవానికి చోటివ్వండి:* తల్లిప్రేమ, దైవానుగ్రహం - ఈ రెండింటి చేరికచేత మానవత్వం దివ్యత్వంగా మారిపోతుంది. కనుక తల్లిదండ్రులను గౌరవించండి, దైవాన్ని ప్రార్థించండి. తల్లిదండ్రులకు జగత్తులో కీర్తిని తెచ్చి పెట్టండి, దైవానికి హృదయంలో స్థానమివ్వండి. ఇదే మీరు చేయవలసింది. మీరు మంచివారైతే తల్లిదండ్రులకు ఎంతో కీర్తి వస్తుంది. లవకుశులు గొప్పవారు కావడంచేత సీతాదేవికి ఎంతో కీర్తి వచ్చింది. రామునితో యుద్ధం చేస్తున్నప్పుడు లవుడు, ''జనని మా జానకీదేవి సాధ్వియేని,

ఇతను ఈ అస్త్రమున మూర్ఛ నొందుగాక!'' అని తల్లిని తల్చుకొని అంబును విడిచేసరికి రాముడు కూడా మూర్ఛపోయాడు. చూశారా! చిన్న పిల్లవాడు కూడా తల్లిని అంతగా స్మరించాడు. తల్లిని మనస్సులో చింతించి, దైవానికి హృదయంలో స్థానమిస్తే తల్లిమహాత్మ్యము కూడా అధికమై పోతుంది. ప్రాచీనకాలంలో కుమారులు దైవచింతనలో మునిగితే తల్లి ఎంతగానో మురిసి పోయేది. ''నా కుమారుడు సన్మార్గంలో నడుచుకుంటున్నాడు, సత్కీర్తి నార్జిస్తాడు'' అని ఎంతగానో ఆనందించేది. కాని ఈనాడు అలాంటి తల్లులు చాల అరుదు. కుమారు డేమైనా ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశిస్తే, ''అయ్యో! వీడేమైపోతాడో!'' అని భయపడతారు. ఇది చాల పొరపాటు. ఈనాటి పరిస్థితుల దృష్ట్యా తల్లిదండ్రులు విశాలహృదయులై కుమారుడు ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించాలని కోరుకోవాలి.

విద్యార్థులారా! మీ దేహానికి మూలాధారం తల్లిదండ్రులే. కాని, మీ జీవితానికే మూలాధారం భగవంతుడు. ఈ సత్యాన్ని దృష్టియందుంచుకొని జన్మ సార్థకం గావించుకొనే మార్గాన్ని అవలంబించాలి. ప్రాణాన్నైనా త్యాగం చేసి సాధించవలసిన కార్యము లెన్నో ఉన్నాయి. కట్టకడపటికి దైవాన్నే సాధించాలి. అదే ఫైనల్ గోల్! దైవానుగ్రహం పొందినవానికి ఎట్టి కొరతయు ఉండదు. ఇదే ఆర్యాంబ ఆనాడు శంకరునితో చెప్పింది. ''నాయనా! దేవీ అనుగ్రహాన్ని పొందిన నీ కింకేమి కొరత? యావత్ప్రపంచమునకే నీవు ఆదర్శప్రాయుడవై సత్కీర్తిని పొందగలవు'' అని ఆశీర్వదించింది. సత్కీర్తి ఒక్కటే కాదు ముఖ్యం, శంకరుడు శాంతిని కూడా పొందగలిగాడు, నిరంతరము ఆనందంగా జీవించాడు, ముప్పైరెండేళ్ళ వయస్సులోపలనే జైత్రయాత్ర సల్పాడు. దీనికి కారణం దేవీ అనుగ్రహమే! ఒక్క దైవానుగ్రహాన్ని సాధిస్తే ఇంక సాధించ లేనిది ఏదీ ఉండదు. కనుక మీరు దైవవిశ్వాసాన్ని పెంచుకొని దైవానుగ్రహాన్ని పొంది మీ జీవితాలను సార్థకం గావించుకుంటారని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

[*తేది: **6.5.97**న 'సాయిశ్రుతి' (కొడైకెనాల్)లో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి*]

---

## ద్విపాద పశువు

దేహపుష్టికి ధాన్యమనియు, మనోపుష్టికి ధ్యానమనియు విధింపబడినవి. వట్టి ధాన్య మొక్కదానినే ఆశ్రయించువాడు ద్విపాద పశువని నిస్సందేహముగా చెప్పవచ్చును. బురదలో పడిన పశువు అన్ని ప్రయత్నములనూ సలిపి పైకి రావటానికి ఆతృత పడుతుంది. కాని సంసారమనే బురద గుంటలో పడిన మనిషి మాత్రం గట్టు చేరుదామని ప్రయత్నమే చేయటము లేదు.

–బాబా

# బృందావనంలో బుద్ధపూర్ణిమ

శ్రీలంక, జపాన్, చైనా, ఇండోనేషియా తదితర దేశాల నుండి సుమారు 1500మంది బౌద్ధమతస్థులు తరలివచ్చి బృందావనంలో బుద్ధపూర్ణిమ మహోత్సవాన్ని ఆనందోత్సాహాలతో, భక్తిశ్రద్ధలతో జరుపుకున్నారు. క్రిందటి సంవత్సరం మొట్టమొదటిసారిగా శ్రీవారి దివ్యసన్నిధిలో సింహళీయుల ఆధ్వర్యంలో జరిగిన ఈ ఉత్సవం ఈ సంవత్సరం అంతర్జాతీయ మహోత్సవంగా రూపుదాల్చడం విశేషం. ఈ సందర్భంగా సాయిరమేశ్ హాల్ సర్వాంగసుందరంగా అలంకరింపబడింది. 15వ తేది ఉదయం 8గంటలకు శ్రీవారు త్రయీబృందావనం నుండి వెలుపలకు రాగా శ్రీలంకకు చెందిన సుప్రసిద్ధ కళాకారులు ఆరుగురు శంఖారావములతో, మద్దెలవాయిద్యాలతో కాండ్యన్ నృత్యం చేస్తూ స్వాగతం పలికారు. శ్రీలంకకు చెందిన ముగ్గురు బౌద్ధమతాచార్యులు, శ్రీలంక రాయబారి శ్రీ మంగళమూనెసింఘె, జపాన్ సాయి సంస్థల అధ్యక్షుడు శ్రీ హీరా తదితర ప్రముఖులు వెంటరాగా శ్రీవారు ప్రసన్నవదనులై చిరునవ్వులు చిందిస్తూ భక్తుల కరతాళ ధ్వనుల మధ్య సాయిరమేశ్ హాల్‌లోనికి ప్రవేశించారు. స్వర్ణకాంతు లీనుతున్న సభావేదికపై శ్రీవారు ఆసీనులు కాగా భక్తులు సింహళభాషలో పలు శ్లోకాలను పఠించారు, ముక్తకంఠంతో ప్రార్థనాగీతాలనాలపించారు. ప్రసాద వితరణతో కార్యక్రమం ముగిసింది.

సాయంత్రం నాల్గుగంటలకు ప్రారంభమైన బహిరంగ సమావేశంలో ముందుగా శ్రీలంక హైకమీషనర్ శ్రీ మంగళమూనెసింఘె, సనాతనసారథి ఎడిటర్ శ్రీ వి.కె. నరసింహన్, శ్రీలంక సాయిసంస్థల కోఆర్డినేటర్ సిస్టర్ నందిని ఆంగ్లంలోను, జపాన్‌కు చెందిన శ్రీ మూశాషి జపనీస్ భాషలోను ప్రసంగించారు. శ్రీలంకలో ప్రస్తుతం జరుగుతున్న మారణహోమాన్ని మాన్పించి శాంతిభద్రతలు నెలకొనేటట్లు ఆశీర్వదించవలసిందిగా శ్రీ మూనెసింఘె శ్రీవారిని ప్రార్థించారు. హింసాప్రవృత్తులు విలయతాండవం చేస్తున్న నేటి తరుణంలో శాంతి, అహింస, ప్రేమలనే సాధనాలుగా గల్గిన శ్రీవారు ధర్మాన్ని పునఃప్రతిష్ఠిస్తారనీ, వారి రక్షణలో అందరూ సుఖశాంతులతో వర్ధిల్లుతారనీ శ్రీ వి.కె. నరసింహన్ తమ ప్రగాఢ విశ్వాసాన్ని వ్యక్తం చేశారు. సిస్టర్ నందిని తమ ప్రసంగంలో ఒక వింతైన విషయాన్ని తెలియజేశారు. అదేమిటంటే - శ్రీలంకకు చెందిన తమిళబౌద్ధులు, సింహళబౌద్ధులు కలసికట్టుగా ఈ బుద్ధపూర్ణిమ వేడుకల్లో పాల్గొనడం. "తమిళులకు, సింహళులకు మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటున్న నేటి తరుణంలో వారు స్వామిసన్నిధిలో కలసిమెలసి ఉండటం వింతగాక మరేమిటి! అయితే ఇలాంటి మార్పు స్వామి తీసుకురావడంలో ఆశ్చర్యమేమీ లేదు. సృష్టికర్తకు అసాధ్యమేమున్నది?!" అని ప్రస్తుతించారు. అనంతరం శ్రీవారు తమ దివ్యసందేశంలో బుద్ధభగవానుని దివ్యబోధలను, జీవితవిశేషాలను వివరించారు. మంగళహారతితో సభ ముగిసింది.

# "ఏకోహం బహుశ్యాం"

ప్రాచీన కాలము నుండి భారతీయులు అనేక మార్గములలో భగవంతుని చేరుటకు ప్రయత్నము సల్పుతూ వచ్చారు. సత్యవతీ ఆరాధన, అంగవతీ ఆరాధన, అన్యవతీ ఆరాధన, నిదానవతీ ఆరాధన అనే నాల్గు విధములైన మార్గములను ఏర్పర్చుకొని భగవంతుని ఆరాధిస్తూ వచ్చారు. సత్యవతీ ఆరాధన అనగా పాలలో వెన్నవలె, నువ్వులలో నూనెవలె, కట్టెలో అగ్నివలె భగవంతుడు ఈ జగత్తంతయు నిండియున్నాడని భావించి ఆరాధించడం. అంగవతీ ఆరాధన అనగా పంచభూతములే పరమాత్మ స్వరూపములని విశ్వసించి ఒక్కొక్క భూతమును ప్రత్యేకించి ఆరాధించడం.

అన్యవతీ ఆరాధన అనగా రూప నామములను ఆధారంగా చేసుకొని భగవంతుని ఆరాధించడం. కోదండపాణి అంటే రాముడని, వీణాపాణి అంటే సరస్వతి అని, గంగాధారి అంటే ఈశ్వరుడని, శంఖుచక్రగదాపద్మములను ధరించిన వాడంటే విష్ణువని ఈవిధంగా ఒక్కొక్క దేవతా రూపమునకు ఒక్కొక్క చిహ్నమును ఏర్పర్చుకొని ఆరాధిస్తూ వచ్చారు. ఒకటి రూపము, మరొకటి నామము. ఈ రెండూ ఒకదానితో ఒకటి చేరినప్పుడే దివ్యత్వము ఆవిర్భవిస్తుంది (అని పలుకుతూ స్వామి ఒక అగ్గిపెట్టెను సృష్టించారు) ఇది ఒక అగ్గిపెట్టె. ఇందులో అగ్గిపుల్లలున్నవి. ఈ అగ్గిపెట్టెలోను, అగ్గిపుల్లలోను ఉన్నది ఒకే శక్తి. అయితే ఈ రెండూ ఒకదాని కొకటి చేరినప్పుడే నిప్పు వస్తుంది. ఇదేవిధంగా రూపనామముల ఏకత్వముచేతనే జ్ఞానాగ్ని లభ్యమవుతుంది. ఈ రెండింటియందు ఉన్నది ఒకే శక్తియే. రూపము నామాన్ని స్మరింప జేస్తుంది, నామము రూపాన్ని నిర్మింపజేస్తుంది.

ఇంక నిదానవతీ ఆరాధన అనగా ఏమిటి? ఇది నవ విధ సాధనలతో కూడినది. "శ్రవణం కీర్తనం విష్ణోస్మరణం పాదసేవనం వందనం అర్చనం దాస్యం స్నేహ మాత్మనివేదనం" ఈ నవ విధ మార్గములలో భగవంతుని ఆరాధించడమే నిదానవతీ ఆరాధన. కాని నేటి యువకులు ఇట్టి పవిత్రమైన సాధనలను విస్మరిస్తున్నారు. "ఏమిటి? రాళ్ళు దేవుళ్ళవుతాయా? చెట్లు దేవు ళ్ళవుతాయా? పుట్టలు దేవుళ్ళవుతాయా? పశువులు దేవుళ్ళవుతాయా?" అని ప్రశ్నిస్తున్నారు. ఇది కేవలం సంకుచితమైన భావము. అణుశక్తి లేని పదార్థము లేదని సైన్సు చెబుతున్నది. మట్టిలో, చెట్టులో, పుట్టలో సర్వత్ర అణుశక్తి ఉన్నప్పుడు మరి దివ్యశక్తి అన్నింటియందు ఎందు కుండ కూడదు? ప్రాచీనకాలంలో, 'అంతా రామమయం, ఈ జగమంతా రామమయం' అని భావించేవారు. దీనినే ఈనాటి సైన్సు, 'అంతా అణుమయం, ఈ జగమంతా అణుమయం' అని బోధిస్తున్నది.

***ఒకటే పెద్దది :*** మన ప్రాచీనులు భగవంతుడుకాని వస్తువు ఈ జగత్తులో లేదని విశ్వసించారు. "ఏకోహం బహుశ్యాం", ఏకత్వము నుండియే

ము ప్రారంభమైనది. ఇది ఒకటి, ఇది తొమ్మిది. ఈ రెండింటిలో ఏది పెద్దదని ఏ పిల్లవానిని అడిగినా తొమ్మిదే పెద్దదని అంటాడు. కాదు, కాదు. ఒకటే పెద్దది. ఎందుచేత? 1+1+1... = 9 అవుతుంది. ఒకటి లేక తొమ్మిది లేదు. కాబట్టి 'వన్ ఈజ్ హీరో, వరల్డ్ ఈజ్ జీరో.' దైవమనే ఏకత్వాన్ని మరచిపోతే హీరో కూడా జీరోగా మారిపోతాడు. అనాది కాలము నుండి మన భారతీయ సంస్కృతి బోధించినది ఇదే!

*'అది మేమే' :* ఒక కొండ లోపల పడియున్న పనికి రాని గుండును శిల్పి ఆకర్షణీయమైన రాముని విగ్రహంగా తీర్చిదిద్దాడు. అయితే అతడు రాయిని రామునిగా చేసినట్లా? కాదు, కాదు. రాయిలో ముందుగానే రాముడున్నాడు. శిల్పి చేసిందల్లా రాముని కప్పియుంచిన 'ప్యాక్'ను విప్పివేయడమే. 'ప్యాక్'ను తీసివేసేటప్పటికి అందులోని రాముడు సాక్షాత్కరించాడు. ఆ రాతివిగ్రహాన్ని మనం మందిరంలో పెట్టి పూజిస్తాము. కాని, ఆ విగ్రహాన్ని చెక్కినప్పుడు క్రింద పడిపోయిన ముక్కలను మాత్రం పూజించము. కారణమేమిటి? ఆకారము లేదు గనుక. అయినప్పటికీ ఆ ముక్కలు చెబుతున్నాయి, "తత్ త్వం అసి" (అది మేమే) అని. అనగా, "మందిరంలో ఉన్న విగ్రహాన్ని శిల్పి వచ్చి మానుండి వేరు చేశాడుగాని, మేము ఒక్కటే" అంటున్నాయి. ప్రాకృతమైన భావనచేత మనమే ఏకత్వాన్ని భిన్నత్వంగా విభజిస్తున్నాము, విశ్వసిస్తున్నాము. ఇది కేవలం వ్యక్తిదోషమేగాని శక్తిదోషము కాదు.

*ఎవరని నిర్ణయించేది? ! :* భగవంతుడు అనంతుడు, అప్రమేయుడు. అనగా ఏట్టి ప్రమాణములకూ చిక్కనివాడు. భగవత్తత్వాన్ని ఎంత తెలుసుకున్నప్పటికీ ఇంకా తెలుసుకోవలసిన దెంతో ఉంటుంది. ఇంత వరకు భగవంతుని గూర్చి తెలుసుకున్నవా రెవ్వరూ లేరు. ఒకానొక తపస్వి భగవంతుని గూర్చి తెలుసుకోవాలని కన్నులు మూసుకొని ధ్యానంలో కూర్చున్నాడు. సాక్షాత్తు భగవంతుడే ఒక చిన్న పిల్లవాని రూపములో వచ్చి, "ఏం తాతగారూ! ఏమి చేస్తున్నారు?" అని అడిగాడు, "నాయనా! భగవంతుని గూర్చి తెలుసుకోవాలని ప్రయత్నం చేస్తున్నాను" అన్నాడు. "మరి తెలుసుకున్నారా?" అని ప్రశ్నించగా, "ఇంకా తెలుసుకోలేదు" అని సమాధాన మిచ్చాడు. కొంతకాలం తరువాత ఆ పిల్లవాడు తిరిగి వచ్చేటప్పటికి ఈ సన్న్యాసి కన్నులు సగం తెరుచుకొని ఉన్నాయి. "ఏం తాతగారూ! తెలుసుకున్నారా?" అని అడిగాడు. "ఆ... సగం తెలుసుకున్నాను నాయనా!" అన్నాడు. "సరే, పూర్తిగా తెలుసుకోండి" అని ఆ పిల్లవాడు వెళ్ళిపోయాడు. కొంతకాలం తరువాత అతడు మళ్ళీ వచ్చేసరికి ఈ సన్న్యాసి పూర్తిగా కన్నులు తెరుచుకొని ఉన్నాడు. "తాతగారూ! భగవంతుని గూర్చి తెలుసుకున్నారా?" అని మరల అడిగాడు. "ఆ... తెలుసుకున్నాను నాయనా!" అన్నాడీ సన్న్యాసి. "ఏమని తెలుసుకున్నారు?" అంటే, "తెలుసుకోవడానికి వీలుకాదని తెలుసుకున్నాను" అన్నాడు. ఎట్లా తెలుసుకోగలడు? భగవంతునికి ఏ రూపమని నిర్ణయించేది? కనుకనే, "శివుడవో, మాధవుడవో! ఎవరని నిన్ను నిర్ణయించేదిరా" అన్నాడు త్యాగరాజు.

*పవిత్రత – సహనం – పట్టుదల:* సర్వరూపములూ భగవత్స్వరూపములే, "దైవం మానుష రూపేణ" ఈ సత్యాన్ని మొట్టమొదట గుర్తించాలి. భగవంతుని విశ్వవిరాట్స్వరూపుడని అన్నారు.

అంటే ఏమిటి? కనిపించే తలలన్నీ భగవంతునివే. ''సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష సహస్రపాత్'' అన్ని శిరస్సులూ, అన్ని నేత్రములూ అతనివే. అతనిది కాని దేదీ లేదు. ఈ విశ్వాసాన్ని మీరు పెంచుకోవాలి. ఇది ఒకరిచ్చేది, పుచ్చుకునేది కాదు. ''స్వామీ! మాకా విశ్వాసం ఇవ్వండి'' అంటారు కొంతమంది. ఇవ్వటానికి, పుచ్చుకోవడానికి ఇదేమీ వడ్డీవ్యాపారం కాదు. దీనిని మీరే పెంచుకోవాలి. మీయందు ప్రేమ ఉన్నది, విశ్వాస మున్నది. అయితే వాటిని దైవమువైపు మరల్చాలి. ఏది చేసినా భగవంతుని పనిగా చేయాలి. ఏ రూపాన్ని చూసినా ఇది భగవంతుని రూపమని అనుకోవాలి. అయితే ఒక్క రూపాన్ని మాత్రం హృదయంలో స్థిరం చేసుకోవాలి. ఎవరేది చెపితే దానిని నమ్మి మనస్సును చలింపచేసుకోకూడదు. పవిత్రత, సహనం, పట్టుదల - ఈ మూడూ మీలో ఉండాలి. దేనిపై పట్టుదల? మంచిదానిపై ఉండాలి. చెడ్డదానిపై పట్టుదల పడితే దానిని పట్టుదల అనరు, మూర్ఖత్వ మంటారు. ప్రహ్లాదుడు ఎలాంటి పరిస్థితిలోనైనా నారాయణ స్మరణను వదల లేదు. ఆ విశ్వాసమే అతనిని రక్షించింది. కనుక భగవద్విషయంలో పట్టుదల అత్యవసరం. బజార్లో పోయే ఎల్లయ్య, మల్లయ్య చెప్పిందల్లా నమ్మి అనుసరించకూడదు.

ఈనాడు కొందరు దైవమంటే నమ్మటం లేదుకాని, జ్యోతిష్యులను, పిచ్చిపిచ్చి నవల్స్‌ను, వార్తాపత్రికలను నమ్ముతున్నారు. ఇంకా కొందరు ఎట్లా తయారవుతున్నారంటే - సాయిబాబా తమకేదో శక్తి ఇచ్చాడని నా మాదిరి తల పెట్టుకొని, గౌను వేసుకొని నటన చేస్తున్నారు. ఇలాంటివారిని నమ్మి చాలమంది మోసపోతున్నారు. ఇలాంటివారి దగ్గరకు మీరు పోకూడదు. సాయిశక్తి ఒకరు ఇచ్చేది, పుచ్చుకునేది కాదు. మీ విశ్వాసంతో మీరు సాధించాలి. మీ విశ్వాసాన్ని తుదిశ్వాస వరకు ఒకే రీతిగా ఉంచుకోవాలి. ఇదే స్థిరభక్తి, అనన్యభక్తి. దైవవిషయంలో చలించని మనస్సు, భ్రమించని దృష్టి చాల అవసరం. ఒక్కొక్కసారి దైవం మిమ్మల్ని కష్టపెడుతున్నాడని మీరు భావిస్తుంటారు. ఇది చాల పొరపాటు. దైవము అన్నింటికీ సాక్షీభూతుడై ఉంటాడు. మీ కర్మలే మీకు కష్టములుగా రూపొందుతున్నాయి. వాటికి కూడా ఏమాత్రము జంకక, క్రుంగక దాటుకొని పోవాలి. ఏదొచ్చినా మీ మంచికోసమే నని భావించాలి. అంతేగాని ఊరికే ఇక్కడ అక్కడ తిరిగితే కాలమును, కాయమును, కర్మను కట్టకడపటికి ధనమును కూడా వ్యర్థం చేసిన వారవుతారు.

(తేది: ***20.7.96***న సాయికుల్వంత్ హాల్‌లో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

---

పెద్ద దేహం కల్గిన నిప్పుకోడి వేటగానిని చూసి ఇసుకలో తన పొడుగాటి మూతిని దూర్చి తన నెవ్వరూ చూడటం లేదనుకుంటుంది. ఈ అమాయక పక్షికి ఇంత పెద్ద దేహం వెలుపల ఉన్నదనే జ్ఞానమే ఉండదు. తమ దోషాలను, దుష్టసంకల్పాలను కప్పిపుచ్చడానికి ప్రయత్నించేవారు ఈ నిప్పుకోడి వంటివారే.

-బాబా

# శాశ్వతానందప్రాప్తి

విద్యార్థులారా! ఎవరైనా ఏడుస్తూంటే, ''ఎందుకయ్యా నీవు ఏడుస్తున్నావు?'' అని అడుగుతాము. కాని ఎవరైనా ఆనందంగా ఉంటే, ''ఎందుకయ్యా నీవు ఏడ్వటం లేదు'' అని అడుగుతామా? అడుగము. ఎందుకంటే మానవునికి ఆనందము సహజము, ఏడుపు అసహజము. ఈ విశాల ప్రపంచమందు ప్రతి జీవి ఆనందమునే ఆశిస్తుంది. 'అందమె ఆనందం, ఆనందమె జీవిత మకరందం'. అయితే జగత్తులో శాశ్వతమైన అందముగాని, శాశ్వతానందముగాని ఎక్కడా కానరావు. ఉదాహరణకు ఒక గులాబీ పుష్పమును తీసుకుందాము. అది చూచుటకు చాల అందంగా ఉంటుంది. ఆ అందమే ఆనందము నందిస్తుంది. కాని దాని అందము ఎంతవరకు? నేడు, రేపు ఉండవచ్చు. మరునాటికి అందమును కోల్పోతుంది. దానితోపాటు ఆనందము కూడా పోతుంది. అనిత్యం అసుఖం లోకం. ఇలాంటి లోకమందు శాశ్వతానందము ఏరీతిగా లభిస్తుంది? శాశ్వతానందము ననుభవించాలంటే నిత్యసత్యమైన భగవంతుని ఆశ్రయించాలి. భగవంతుడే అందము. ఆ అందములోనే శాశ్వతానందము ఉంది.

''మాకురు ధన జన యౌవన గర్వం హరతి నిమేషా కాలస్సర్వం...'' అన్నారు శంకరులవారు. ఒకానొక సమయంలో ఒక విద్యార్థి ఒక హస్త సాముద్రికుని దగ్గరకు వెళ్ళాడు. అతడు ఈ పిల్లవాని చేయి చూసి, ''ఆహా! నీవు గొప్ప ధనవంతుడ వవుతావు'' అన్నాడు. ఈ పిల్లవాడు చాల సంతోషించాడు. మరి కొంత సేపటికి, ''నాయనా! నీ విద్యారేఖ కూడా చాల బాగున్నది. నీవు గొప్ప విద్యావంతుడ వౌతావు, గొప్ప కీర్తిని సంపాదిస్తావు'' అన్నాడు. ఈ విద్యార్థి ఆనందానికి అవధులు లేవు. కాని, మరి కొంతసేపు ఇతని చేయిని పరీక్షగా చూసి ఏమీ చెప్పక కొంత నిరాశ చెందినట్లు కనిపించాడు. ''ఏమిటండీ యోచిస్తున్నారు? ఇంకా ఏమైనా చెప్పండి'' అన్నాడీ విద్యార్థి ఉత్సాహంగా. ''నాయనా! ఏమని చెప్పేది? అన్నీ బాగున్నాయి కాని నీ ఆయుస్సు చాల తక్కువగా ఉంది'' అన్నాడు. దీర్ఘాయుస్సు లేనప్పుడు ఎన్ని ఉండీ ఏమి ప్రయోజనం? అదేవిధంగా శాశ్వతానందము లేనప్పుడు మానవునికి ఎన్ని సిరిసంపద లున్నప్పటికీ ప్రయోజనం లేదు. శాశ్వతానందము ననుభవించా లంటే ఈ అశాశ్వతమైన జగత్తులో కొంత జాగ్రత్తగా మెలగాలి.

మహాభారత యుద్ధం జరుగుతున్న సమయంలో వ్యాసులవారు ఆ యుద్ధాన్ని చూసే నిమిత్తమై వెళుతున్నారు. ఆ సమయంలో ఒక చిన్న పురుగు దారికి అడ్డంగా పరుగెత్తి పోవడం కనిపించింది. వ్యాసులవారికి చాల ఆశ్చర్యం కలిగింది. ''ఓ క్రిమీ! నీ వెందు కింత వేగంగా పరుగెత్తుతున్నావు?'' అని ప్రశ్నించాడు. దానికి మాట్లాడే శక్తిని అనుగ్రహించి జవాబు చెప్పమన్నాడు.

అప్పుడా పురుగు, ''స్వామీ! ఇంకొంత సమయంలో ఇటువైపుగా ఒక రథము రాబోవు చున్నది. దాని వేగమునకు భూమి కంపించి పోతున్నది. అది రాక పూర్వమే నేను ఇంటికి చేరాలని త్వరగా వెళుతున్నాను'' అన్నది. ''నీవు చూడటానికి ఇంత చిన్నగా ఉన్నావు. నీకు కూడా ప్రాణంపై ఇంత ప్రేమా?'' అని వ్యాసులవారు అడుగగా ఆ పురుగు, ''స్వామీ! మా ఆకారములు చిన్నవిగా ఉండవచ్చుకాని, ప్రాణం ఒక్కటే కదా! ఎంతో గొప్ప మేధాశక్తి కల్గిన మానవుడు ఏ సుఖసంతోష భోగభాగ్యములను అనుభవిస్తున్నాడో వాటిని మేము కూడా అనుభవిస్తున్నాము. మానవుడు కుటుంబ సంబంధమైన విషయాలలో శాశ్వతానందమున్నదని భ్రమిస్తున్నాడు. మానవుడు అనుభవిస్తున్న ఆనందాన్ని మేము కూడా మా కుటుంబంలో అనుభవిస్తున్నాము. మానవునివలె మేము కూడా మధురమైన పదార్థములను ఆరగించి ఆనందిస్తున్నాము. కనుక ఆకారం ప్రధానం కాదు, మాకు కూడా ప్రాణం పైన ప్రీతి ఉన్నది'' అన్నది. ఈ మాటలు వ్యాసుల వారికి కనువిప్పు కలిగించాయి. ''ఇది చూడటానికి చిన్న పురుగువలె కనిపిస్తున్నదికాని పరమసత్యమునే చెబుతున్నది'' అని గుర్తించాడు.

క్రిమికీటకాదులకు, మానవునికి కేవలం ఆకారములోనే భేదమున్నది కాని, అనుభవించే సుఖదుఃఖములు సమానమే. కీటకమునకు చిన్న బాధ, మనిషికి పెద్ద బాధ అని కొందరు భావిస్తారు. అది చాల పొరపాటు. విశాలమైన సముద్రమునకు ఏ రుచి ఉంటుందో అదే రుచి అందులోని ఒక చిన్న నీటిబిందువుకు కూడా ఉంటుంది. నీటిబిందువులో ఉప్పు తక్కువగా ఉండవచ్చుకాని, రుచి ఒక్కటే కదా! అదేవిధంగా ప్రతి ప్రాణికి సుఖదుఃఖములు సమానమే. అయితే మానవుడు ఏవిధంగా ఉండాలంటే - సుఖ దుఃఖములను సమంగా చూసుకోవాలి. ''సమత్వం యోగముచ్యతే'', అదే నిజమైన యోగము. ఆకార భేదమును చూడకూడదు, అనుభూతిని మాత్రమే దృష్టియందుంచుకోవాలి. పుట్టిన బిడ్డకు ఆకలి ఎటువంటిదో తల్లికి కూడా అటువంటిదే. అమ్మ అన్నం తింటుంది, బిడ్డ పాలు త్రాగుతాడు. కాని ఇరువురికీ ఆకలి ఒక్కటే. అదేవిధంగా ప్రతిజీవికి అన్ని అనుభూతులు సమంగానే ఉంటున్నాయి. వేదములనే విభజించిన గొప్ప జ్ఞానియైన వ్యాసునికి కూడా ఈ విషయము ఒక కీటకము చెప్పేంతవరకు అర్థం కాలేదు.

చిన్న క్రిమికీటకాదుల నుండి కూడా మనం నేర్చుకోవలసినది ఎంతో ఉన్నది. ఈ ప్రపంచమంతా మనకు ఎన్నో ఆదర్శములను బోధిస్తున్నది. కనుక మనం శాశ్వతానందమును పొందాలంటే గ్రంథములవల్లగాని, గురుబోధలవల్లగాని పొంద లేము. ప్రతి విషయమును చక్కగా విచారణ చేసి అనుభూతిలోకి తెప్పించుకోవాలి. మనం చేసే ప్రతి పనియందు నిత్యానిత్యములను గుర్తించాలి, క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగమును తెలుసుకోవాలి. దేహము- క్షేత్రము, చైతన్యము - క్షేత్రజ్ఞుడు. అయితే ఈ చైతన్యమును గుర్తించడానికి దేహమే ఆధారము. దేహము - దృశ్యకల్పితము, చైతన్యము - అదృశ్య తత్త్వము, అగోచరము. కనుక గోచరముకాని చైతన్యతత్త్వమును అగోచరమైన జ్ఞానంతోనే అనుభవించాలి. అందుకోసమే ధ్యానము (మెడిటేషన్) చేయాలన్నారు. అనగా కన్నులు మూసుకొని ఏది మనకు కనిపించకుండ

ఉన్నదో దానిని పొందడానికి ప్రయత్నించాలి. మనం దేవాలయానికి వెళ్ళినప్పుడు దేవుని ముందర కన్నులు మూసుకొని నమస్కారం చేస్తాము. అంతదూరం పోయి విగ్రహాన్ని చూడకుండా కన్నులు మూసుకోవడ మెందుకు? కన్నులతో చూసినది దృశ్యకల్పితమైనది. అనగా ఆ విగ్రహం కూడా దృశ్యకల్పితమైనదే. కాని, ఆ విగ్రహం నుండి ఆవిర్భవించే ఆనందము అగోచర మైనది. అట్టి అగోచరమైన ఆనందమును దేహములోనున్న అగోచరమైన జ్ఞానముతోనే అనుభవించాలి.

జనక మహారాజుకు ఒకనాటి రాత్రి తాను రాజ్యాన్ని కోల్పోయి ఆకలితో అలమటిస్తూ అరణ్యంలో ఏకాకిగా సంచరిస్తున్నట్లు కల వచ్చింది. ఆ కలలో ఎవరో ఒక వ్యక్తి తనకు ఒక ఆకులో ఇంత అన్నం పెట్టి ఇవ్వగా మరుక్షణంలో ఒక గ్రద్ద వచ్చి దానిని తన్నుకు పోయింది. ఆ ఆవేదనలో అతనికి మెలకువ వచ్చింది. మెలకువ వచ్చేసరికి తాను బెడ్‌రూమ్‌లో ఉన్నాడు. వెంటనే లేచి కూర్చుని, ''అది నిజమా? ఇది నిజమా?'' అన్నాడు. ప్రక్కనే ఉన్న రాణి, ''ఏమిటండీ! ఎందుకిలా అంటున్నారు?'' అని అడిగింది. కాని జనకుడు ఆమె మాట వినిపించు కోవడం లేదు. ''అది నిజమా? ఇది నిజమా? అంటున్నాడు. రాణికి దిక్కుతోచక కులగురువును పిలిపించింది. ఆయన వచ్చి జ్ఞానదృష్టితో అసలు సంగతిని గ్రహించి, ''మహారాజా! జాగ్రత్తలో స్వప్నము లేదు, స్వప్నములో జాగ్రత్త లేదు. కాబట్టి అది నిజము కాదు, ఇది నిజము కాదు. అయితే నీవు జాగ్రత్తలోను ఉన్నావు, స్వప్నములోను ఉన్నావు. కాబట్టి నీవే నిజము'' అన్నాడు. అనగా, ఈ జగత్తులో అనుభవించునవన్నీ ఏదో ఒకనాటికి కాలగర్భములో కలసిపోవునవే. శాశ్వత మైన ఆనందము ఒక్క దివ్యత్వమునందు మాత్రమే అనుభవించడానికి వీలవుతుంది.

నీకు ఆకలి వేస్తున్నది. క్యాంటీనుకు వెళ్ళి రెండు చపాతీలు తిన్నావు. ఆకలి తీరింది, సంతోషము! కాని ఎంతసేపు? రెండు గంటల తరువాత తిరిగి ఆకలి ప్రారంభమవుతుంది. చపాతీ తిన్న ఆనందము కొద్దిసేపే ఉంటుంది. తరువాత మళ్ళీ తినాలనిపిస్తుంది. ఇదేరీతిగా ఈ ప్రాకృతమైన భోగభాగ్యములు తాత్కాలికమైన సుఖమును అందించవచ్చునేమోగాని శాశ్వతానందమును అందించ లేవు. ధృతరాష్ట్రునికి కావలసినంత సిరి సంపద లున్నాయి. కాని, అతనికి ఆనందమనేది లేదు. శరీరము హంసతూలికా తల్పముపై పవళించినా మనస్సు మాత్రం అగ్నిపర్వతంపై ఉన్నది. మీ రెంతో ధనము వ్యయం చేసి ఎయిర్ కండీషనర్ పెట్టుకోవచ్చు, డన్‌లప్ సోఫాలు పెట్టు కోవచ్చు. ఇవన్నీ దేహాన్ని చల్లబర్చుతాయికాని మనస్సును చల్లబర్చలేవు కదా! మనస్సును చల్ల బర్చునది ఒక్క దైవచింతనే. అందువల్లనే అర్జునుడు, ''చంచలం హి మనః కృష్ణ ప్రమాది బలవద్దృఢం'' అన్నాడు. ''కృష్ణా! ఈ మనస్సు మహా చంచల మైనది. దీనితో ఏవిధంగా ఆనందాన్ని అనుభవించ గలను?'' అని ప్రశ్నించాడు. అప్పుడు కృష్ణుడు, ''అర్జునా! నా ఆజ్ఞను శిరసావహించు. నీవు మనస్సును అనుసరించవద్దు, దానివైపే చూడవద్దు. ఎప్పుడూ దైవచింతనే చేయి. యుద్ధములో కూడా నన్నే స్మరించు. యుద్ధము చేస్తున్నది దేహమే కాని, మనస్సు కాదు కదా! కాబట్టి మనస్సుతో నన్ను స్మరించు. సర్వకాల సర్వావస్థలయందు

మనస్సును నాయందు నిలిపినప్పుడే శాశ్వతానందము లభ్యమవుతుంది'' అన్నాడు.

మీరు ఈ జగత్తును లౌకిక దృష్టితో చూడటంచేత మీకు అంతా భిన్నత్వం కనిపిస్తున్నది. లోకాన్ని దైవదృష్టితో చూడండి. మీకు కనిపించే తలలన్నీ భగవంతుని తలలే. అన్నీ భగవంతుని స్వరూపాలే. ఇట్టి ఏకత్వభావనవల్ల ఎంతో శాంతి లభ్యమవుతుంది, ఎంతో సుఖాన్ని అనుభవిస్తారు. ''ఇతను పేరు, ఆమె పేరు'' అనే భేదమును పాటించడంచేతనే మీకు ఖేదము ప్రారంభమౌతున్నది. విశ్వమును విష్ణుస్వరూపంగా భావించాలి. అందరిలోను దైవాన్ని దర్శించాలి. సర్వకర్మలను దైవార్పితం గావించాలి. అప్పుడే శాశ్వతానందము ప్రాప్తిస్తుంది.

*(తేది:22.7.96న సాయికుల్వంత్‌హాల్‌లో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

---

# సున్నాల పన్నా

*ప్రత్యక్షమైన దైవమును కాదందువా?*
*నీ జీవితం బెల్ల నిండు సున్న*
*వేదవాక్కులయందు విశ్వాసముంచవా?*
*కొండంత బలమున్న గుండు సున్న*
*ఆర్తసేవా పరాయణత కాదందువా*
*భళి భళీ! బ్రతుకెల్ల బండి సున్న*
*భజనలో నైనను పాల్గొన నందువా*
*అధికారి వగుగాక అసలు సున్న*
*అన్న మిడునట్టి దేవున కక్కటికట*
*సున్నమిడు టెంత దోషమో చూచుకొనుము*
*లెమ్ము! సన్మార్గ గామివి కమ్ము! రమ్ము!*
*బుద్ధి బలమున్న మానవా! మోసపడకు*

*ప్రేమతో నొకమారు పిలువవా దైవంబు*
*నీ జీవితం బెల్ల నిష్ఫలంబు*
*ఉన్నంతలో త్యాగ మొనరింప కుందువా*
*నీ సంపదావళి నిష్ఫలంబు*
*దేవు డున్నాడని తెలియగా నేరవా*
*నీ మానవత్వంబు నిష్ఫలంబు*
*సరివానిలో దేవు నరయగా నేరవా*
*నీదు విజ్ఞానంబు నిష్ఫలంబు*
*సత్యలోకంబు వైకుంఠ స్వర్గములను*
*దాటి కైలాస మందుండి ధరణి డిగ్గి*
*మనుజులందున మనుజుడై మసలుచున్న*
*మాధవుని చూడుమా పర్తి! మానవుండ!*

*- వీరుభొట్ల సూర్యనారాయణ (తాడేపల్లిగూడెం)*

---

*పరుగెత్తే రైలుతోపాటు పట్టాలు కూడా పరుగెత్తితే ప్రయాణీకుల ప్రాణాలు ఏమవుతాయో చెప్పడానికి వీలుకాదు. అదేవిధంగా పరుగెత్తే ప్రపంచంతోపాటు భగవంతుడు కూడా పరుగెత్తుతూ ఉంటే పరిస్థితి అయోమయంగా ఉంటుంది. కనుక భగవంతుడు సాక్షీభూతుడై నిత్యసత్య స్వరూపాన్ని, స్థిరత్వాన్ని పొందియున్నాడు.*

*- బాబా*

# మూడు తరహాల వ్యక్తులు

''నీటియందె పుట్టి నీటియందె పెరిగి
నీటియందణంగు నీటి బుడగ
నరుడు బుద్బుధంబు, నారాయణుడు నీరు
మరువబోకు డిటువంటి మంచిమాట''

విద్యార్థులారా! మానవులను మూడు విధములుగా విభజించవచ్చును. 1. పుష్టి జీవులు. 2. మర్యాద జీవులు. 3. ప్రవాహ జీవులు.

మొదటి తరహా వ్యక్తులు పుష్టి జీవులు. వీరు ఎట్టి సాధనలూ చేయకపోయినప్పటికీ, వేదములను పఠించకపోయినప్పటికీ, శాస్త్ర విచారణలో జీవితాన్ని గడుపకపోయినప్పటికీ పురాకృత పుణ్యఫలముచేత భగవత్ప్రేమకు పాత్రులౌతారు. ప్రాకృతమైన జీవితంలో వీరు జపతపాది సాధనలు సల్పరు, సల్పనవసరం లేదు కూడా. వంట అయిన తరువాత కట్టెలతో పనేమిటి! అట్లే భగవదనుగ్రహం లభించిన తరువాత ఇంక సాధన లెందుకు? పుష్టి జీవులు కేవలం దైవమును వరించి, దైవము నానందింప జేయడానికే తమ కాయమును, కాలమును, కర్మను అంకితం గావిస్తారు. వీరికి దైవచింతన సహజంగానే అలవడుతుంది, ప్రత్యేకించి సత్సంగంలో చేరనక్కర లేదు. వీరు ఏమి చేసినా, ఏమి చూసినా, ఏమి తలచినా అంతా పవిత్రమైనదిగానే ఉంటుంది. వీరిని దైవమే తన సన్నిధికి చేర్చుకుంటాడు. ప్రహ్లాదుడు, ధ్రువుడు బాల్యమునందే దైవాన్ని వరించి దైవప్రేమకు పాత్రులయ్యారు. మానవత్వాన్ని ధరించిన తరువాత దైవాన్ని వరించి, దైవానికి ప్రీతికరంగా ఉండటం మహా అదృష్టం.

రెండవ తరహా వ్యక్తులు మర్యాద జీవులు. వీరు వేదశాస్త్రఇతిహాస పురాణములందు ప్రవీణులై, బ్రహ్మసూత్రములు, భగవద్గీత ఇత్యాది సద్గ్రంథములను పఠిస్తూ నిరంతరము సాధనలు సల్పుతూ ఉండే వ్యక్తులు. కాని వీరు గొప్ప పండితులైనప్పటికీ దైవానుగ్రహమునకు నోచుకోలేక పోతున్నారు. కారణ మేమిటి? వీరు గ్రంథ పరిచయమునందే కాలమును వ్యర్థం చేస్తున్నారుకాని, చదివిన వాటిలో ఒక్కటైనా ఆచరణలో పెట్టడం లేదు.

''ఆకొన్నవాని ఆకలి తీరునా
పంచభక్ష్యంబుల పాకము విన్నయంత
నిరుపేదవాని పేదరికము పోవునా
విత్త ప్రభావంబు విన్నయంత
రోగపీడితుని బలురోగంబు పోవునా
ఔషధ మహిమంబు విన్నయంత''

గ్రంథ పరిచయం కూడా ఉండవలసిందే. కాని నిరంతరం తెలుసుకొనుటయందే కాలమును వ్యర్థం చేస్తే ఇంక తెలుసుకొన్నవాటిని ఆచరణలో పెట్టే దెప్పుడు? అందుచేతనే కొందరు ఎన్ని నేర్చినప్పటికీ దైవానుగ్రహాన్ని పొందలేక పోతున్నారు. ఈనాడు లోకంలో మర్యాద జీవులు అనేకమంది ఉన్నారు. ఎక్కడ కూర్చున్నా జపం చేస్తూనే ఉంటారు. బజార్లో పోతున్నా జపమాల త్రిప్పుతూనే ఉంటారు. కాని హృదయంలో దైవాన్ని ప్రతిష్ఠించుకోకుండా ఎన్ని జపములు చేసినా ప్రయోజనమేమిటి? భగవంతుడు మీ హృదయవాసి. దయగల హృదయమే దైవమందిరము. కనుక, మీరు దయామయులుగా రూపొందాలి.

భగవంతుడు పుష్టిజీవుల జన్మాంతర పుణ్యము చూస్తాడుకాని ప్రస్తుత పరిస్థితిని ఏమాత్రము చూడడు. ప్రస్తుత పరిస్థితిని మాత్రమే చూస్తే కొందరికి దైవానుగ్రహ ప్రాప్తికి అర్హత లేకపోవచ్చు. లోకులు ప్రస్తుత జీవితమును మాత్రమే చూస్తారు. కాని భగవంతుడు మొట్టమొదట గడచిపోయిన జీవితమును చూస్తాడు, తరువాత వర్తమానమును చూస్తాడు, భవిష్యత్తును కూడా చూస్తాడు.

ఇంక మూడవ తరహా వ్యక్తులు ప్రవాహ జీవులు. వీరు ఏ సాధనలూ చేయరు. నిరంతరము లౌకికమైన, ప్రాకృతమైన చర్యలతో కాలాన్ని వ్యర్థం చేస్తుంటారు. కొందరు కనీసం సంకట మొచ్చినప్పుడైనా, 'వెంకటరమణా!' అంటారుకాని, ప్రవాహ జీవులు అది కూడా అనరు. అసలు ఎప్పుడూ భగవచ్చింతనే చేయరు. కేవలం భౌతికమైన సుఖమును పొందాలి, భౌతికమైన కీర్తిమర్యాదల నందుకోవాలన్న చింతనే తప్ప ఆధ్యాత్మిక మంటే ఏమిటో వీరికి తెలియదు. అనిత్యమైన జగత్తును నిత్యముగాను, నిత్యసత్యమైన దివ్యత్వమును అసత్యంగాను భావిస్తారు. ఇది ఎంత పొరపాటు చెప్పండి! కనిపించే చెట్టుకు కనిపించని వేర్లే ఆధారం. కనిపించే భవనానికి కనిపించని పునాదులే ఆధారం. కనుక కనిపించనంత మాత్రమున దివ్యత్వం లేదని భావించకూడదు. ఆ కనిపించనిదే ఈ కనిపించే జగత్తుకు ఆధారభూతమై యున్నది. ఇట్టి దివ్యత్వాన్ని విస్మరించి భౌతిక జగత్తును విశ్వసించేవారే ప్రవాహ జీవులు.

అయితే బాహ్యమునకు ప్రవాహ జీవులవలె కనిపించేవారిలోను కొందరు పుష్టిజీవు లుంటారు. ఈ ఆధునిక యుగంలో బాహ్యంగా భగవన్నామ స్మరణ చేస్తే లోకులు అపహాస్యం చేస్తారేమోనన్న భయంతో కొందరు లోలోపలే భగవంతుని స్మరిస్తుంటారు. ఒక గృహిణి పరమ భక్తురాలు. కాని ఆమెభర్త మాత్రం ఆమె వినగా ఏనాడూ రామా! కృష్ణా! అని ఉచ్చరించినవాడు కాదు, ఏ దేవాలయమునకూ వెళ్ళినవాడు కాదు, ఏ మహనీయులనూ దర్శించినవాడు కాదు. తన భర్త భగవంతుని విస్మరించి లౌకిక విషయాలలో మునిగి తన జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నాడనే ఆవేదన ఆమెలో దినదినమునకు పెరిగిపోతూ వచ్చింది. "ఓ భగవంతుడా! నా భర్త నిరంతరము నిన్ను స్మరించేటట్లు మంచిబుద్ధిని అనుగ్రహించు" అని ప్రతి నిత్యము భర్తను గురించే ప్రార్థన చేసేది. ఒకనాటి రాత్రి ఆయన పక్క మీద అటూ ఇటూ దొర్లుతూ 'రామా!' అన్నాడు. ఆమె విన్నది, ఆనందంతో పొంగిపోయింది. భర్తకు చెప్పకుండా తెల్లవారుఝామున లేచి ఇంటికి మంగళతోరణం కట్టింది. ఇల్లంతా శుభ్రం చేసి బీదలకు అన్నదానం చేయడానికి తగిన ఏర్పాట్లు చేయసాగింది. మంగళవాయిద్యములవారిని పిలిపించింది. భర్త లేచి ఇదంతా చూశాడు. "ఏమిటీ రోజు పండుగ? ఎందుకింత ఆర్భాటం చేస్తున్నావు?" అని అడిగాడు. ఆమె చేతులు జోడించి, "నాథా! నీ నోటి నుండి నేను ఒక్కనాడైనా రామా! కృష్ణా! అన్న పదములు వినియుండలేదు. కాని క్రిందటి రాత్రి విన్నాను. భగవంతుడు ఇన్నాళ్ళకు నా ప్రార్థన నాలకించాడు" అన్నది ఆనందంగా. ఈ మాటలు విని భర్త స్థంభించిపోయాడు. "ఇంత కాలంగా రాముని నా హృదయంలో ఎంతో భద్రంగా ప్రతిష్ఠ చేసుకొని ఎవ్వరికీ తెలియకుండా దాచుకొన్నాను. ఈ సంగతి నాకు, రామునికి

తప్ప మరొకరికి తెలియదు. అలాంటి రాముడు ఈ రోజు బయట పడిపోయాడా, నా నోటి నుండి వెళ్ళిపోయాడా!'' అని విచారిస్తూ ప్రాణం విడిచాడు. చూశారా! ఇలాంటివారు చూడటానికి ప్రవాహ జీవులవలె కనిపించినా నిజంగా పుష్టి జీవులే. బాహ్యంగా భగవచ్చింతన చేస్తున్నట్లు కనిపించక పోవచ్చుకాని, లోపల ఏ చింతన చేస్తున్నారో ఎవరికి తెలుసు? లోగుట్టు భగవంతునికే తెలుసుకాని మరొకరికి తెలియదు.

చాలమంది రిటైర్ అయిన తరువాత భగవచ్చింతన చేస్తా మంటారు. పిల్లలు లేతవయస్సులోనే భగవచ్చింతన ప్రారంభిస్తే వారి జీవితం ఏమై పోతుందోనని అనేకమంది తల్లిదండ్రులు భయపడు తుంటారు. ఇది చాల పొరపాటు.

''*పదపదమంచు కింకరులు పాశము లాగెడు వేళ*
*బంధువుల్ దబదబ బయట పెట్టుడిక లాభము*
*లేదని చెప్పువేళ, ఆలుబిడ్డలున్ లబలబ ఏడ్చువేళ*
*తరమా హరినామము నోట బల్కగన్?*''

కనుకనే, START EARLY, DRIVE SLOWLY, REACH SAFELY అని చెప్పాను. లేతవయస్సు నుండే దైవచింతన చేయాలి. మంచి మధురమైన రసముతో నిండిన ఫలమును భుజిస్తే ఆనందము కల్గుతుందికాని, కుళ్ళిపోయి కంపుకొట్టే సమయంలో ఎవరు భుజిస్తారు? ఈ యౌవన మనేది మధురమైన రసముతో కూడిన ఫలమువంటిది. దీనిని భగవంతునికి అర్పించాలి. కనుక లేత వయస్సు నుండే మీరు దైవచింతన ప్రారంభించాలి. అప్పుడే మీకు శాంతి చేకూరుతుంది.

మీరు చూసే యుండవచ్చు - నిన్న జగన్నాథుని రథము యొక్క ఊరేగింపు జరిగింది. లక్షలాది ప్రజలు అందులో పాల్గొన్నారు. ఈ దేహము కూడా ఒక రథమువంటిదే. దీని లోపల ఉండేది ఆత్మస్వరూపుడైన దేవుడు. అతని ఊరేగింపే ఈ జీవితం. లోపల ఆ విశ్వనాథుని రూపముంటేనే విశ్వంలో ఈ రథం బయలుదేరు తుంది. కనుక ప్రతి జీవి భగవంతుని అంశమే. ఈ సత్యాన్ని గుర్తించి మానవత్వాన్ని సార్థకం గావించు కోవాలి, క్షణికమైన విషయభోగాలలో మునిగి వ్యర్థం చేసుకోరాదు. నిన్న చెప్పాను - వ్యాసుల వారికి చిన్న కీటకము ఎంత గొప్ప పాఠం నేర్పింది! ''అయ్యా! మీ కుండే విషయవాసనలు మాకూ ఉన్నాయి. మీరు ఆశించే భోగభాగ్యములను మేమూ ఆశిస్తున్నాము. మీవలె మాకూ భార్యా పిల్లలున్నారు. మీవలె మేము కూడా తింటున్నాము, నిద్రిస్తున్నాము. ఈ విషయంలో మీకు, మాకు భేదమే లేదు. మరి నేనేదో చిన్న క్రిమినని ఎందుకు చులకనగా చూస్తున్నావు?'' అని అడిగింది. మానవజన్మ విశిష్టతను గుర్తించుకోలేక మీరు పశుపక్షి క్రిమికీటకాదులవలె జీవిస్తూ ఏదో Enjoy(ఎన్‌జాయ్) చేస్తున్నామనుకుంటున్నారు. అది కాదు, మీరు సాధించవలసినది End-joy(ఎన్డ్-జాయ్). అనగా అంత్యములో మీరు ఆనందంగా ఉండాలి. జీవితకాలంలో చేసిన స్మరణ అంత్యకాలంలో ఆదరణ క్రింద వస్తుంది. ఈ ప్రాకృతమైన ఎన్‌జాయ్‌మెంట్ క్షణభంగురమైనది. మీరు ఎన్డ్-జాయ్‌కోసం పాటుపడాలి. అది కేవలం భగవచ్చింతన ద్వారానే ప్రాప్తిస్తుంది. అయితే చింతన చేసినంత మాత్రమున చాలదు, భగవత్కార్యములలో కూడా పాల్గొనాలి. కార్యము కాయముతో చేయాలి, చింతన మనస్సుతో చేయాలి. అప్పుడే మీకు ఆత్మానందము ప్రాప్తిస్తుంది.

*(తేది: **23.7.96**న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

# ధర్మం పురుష లక్షణం

"దానధర్మము లేక, దయయు సత్యము లేక
మానసంబున మంచి నీతి లేక
చెడుగుణంబులతోడ చెలగుచున్నట్టి
హీను డిలను చెడును, పరము చెడును."

విద్యార్థులారా! సత్యధర్మములకు మీరే వారసులు. ఈనాడు అనేకమంది సత్యధర్మములను ప్రచారం చేయుటకు ప్రయత్నిస్తున్నారు. కాని అవి లేనిచోటనేది ఉంటే కదా ప్రచారం చేయడం! సర్వత్ర ఉన్న సత్యధర్మములను ప్రచారం చేయడ మెందుకు? ప్రచారం చేయనక్కర లేదు, ఆచరణలో పెట్టాలి.

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

అన్నాడు కృష్ణపరమాత్ముడు. ధర్మము ఎప్పటికీ నశించేది కాదు. నిజంగా నశించేదే అయితే అది ధర్మము కాదు. అయితే కొంతకాలము మానవునిలో ధర్మాచరణ సన్నగిల్లి పోవడంచేత అది మరుగున పడినట్లుగా కనిపిస్తుంది. ప్రకాశించే సూర్యునికి దట్టమైన మేఘము అడ్డు వచ్చినప్పుడు భూమిపైనున్న వ్యక్తి సూర్యుని చూడలేడు. అంతమాత్రమున సూర్యుడుగాని, సూర్యుని తేజస్సుగాని క్షీణించినట్లు చెప్పవచ్చునా? అదేవిధంగా సత్యమనే సూర్యుడు, ధర్మమనే సూర్యప్రకాశము ఎన్నటికీ క్షీణించడానికి వీలుకాదు. సత్యధర్మములు రెండూ మేటర్ అండ్ ఎనర్జీవలె, ప్రకృతీపరమాత్మలవలె అవినాభావ సంబంధము గలవి, అన్యోన్యాశ్రయములై యున్నవి. వీటిని విడదీయుటకు వీలుకాదు.

ఈ ఆధునిక యుగంలో కొందరు ఉద్యోగం పురుష లక్షణ మంటారు. అయితే ఉద్యోగం లేని పురుషు లెంతమందో ఉంటున్నారు, ఉద్యోగం చేస్తున్నవారిలో అనేకమంది స్త్రీలు కూడా ఉన్నారు. కనుక ఉద్యోగం కాదు పురుష లక్షణం, ధర్మం పురుష లక్షణం, సత్యం పురుష లక్షణం. పురుషు డనగా ఎవరు? ప్యాంటు, షర్టు వేసుకున్నవాడు కాడు. ఆడవాళ్ళు కూడా ప్యాంటు, షర్టు వేసుకుంటే వారిని పురుషులని చెప్పడానికి వీలవుతుందా? ఇవన్నీ పైపైడ్రస్సులే. దేహము కూడా ఒక డ్రెస్సే! కాబట్టి దేహాన్ని బట్టి పోకూడదు, దేహిని ఆధారంగా చేసుకోవాలి. దేహమునకే పురమని పేరు. ఈ పురములో నఖ శిఖ పర్యంతము సంచరించే చైతన్యమే పురుషుడు. కనుక ధర్మము ప్రతి మానవునకు, ప్రతి జీవికి సంబంధించిన లక్షణమే. అయితే ఈ ధర్మమును మనం ప్రాకృతంగా బ్రహ్మచర్య ధర్మమని, గృహస్థ ధర్మమని, వానప్రస్థ ధర్మమని, సన్న్యాస ధర్మమని విభజించుకున్నాము. ఒక్కొక్క తెగకు ఒక్కొక్క ధర్మమున్నదని భావిస్తున్నాము. ఇది బహిర్ముఖమైన ధర్మమేగాని అంతర్ముఖమైన ధర్మము కాదు. అంతర్ముఖమైన ధర్మము ఎలాంటిది? "మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం," మనస్సు, మాట, క్రియ మూడూ

ఏకం కావాలి. ఇదే ప్రతి మానవునికి సత్యమైన ధర్మము. పశుపక్షి మృగాదులకు సంబంధించిన ధర్మములు వేరువేరుగా ఉంటున్నాయి. అగ్నికి దహనశక్తి ధర్మము, నీటికి ప్రవాహశక్తి ధర్మము, చక్కెరకు తీపి ధర్మము. ఇదేవిధంగా ఒక్కొక్క వస్తువుకు ఒక్కొక్క ధర్మం ఏర్పడింది. ఇది సృష్టితోనే ప్రారంభమైనది.

ధర్మమనగా Righteousness, Right action అని ఏమేమో అర్థాలు చెబుతారుకాని, ఇవి సరియైనవి కావు. ఇవన్నీ ధర్మమునకు ప్రతి బింబములు మాత్రమే. ధర్మమునకు పర్యాయపదము లేదు. సంస్కృతములో ధర్మమునకు ధర్మమే సరియైన అర్థము. ధర్మము నీకంటే ముందు పుట్టిన తల్లివంటిది. భార్యను నీవు ఎన్నుకోవచ్చు. కాని ధర్మమును ఎన్నుకునే అధికారము ఒక్క దైవానికి తప్ప మరెవ్వరికీ లేదు. ''ధర్మమూల మిదం జగత్,'' ఈ జగత్తంతా ధర్మముపై ఆధారపడియున్నది. ఇప్పుడు లోకంలో అనేక మంది అనేక ధర్మములు ప్రబోధిస్తున్నారు. అలాంటప్పుడు దేనిని ధర్మమని నీవు నిర్ణయించ గలవు? నీ అంతరాత్మకు తృప్తినిచ్చేదే నిజమైన ధర్మము. నీ అంతరాత్మయే నీకు గురువు, ఏదో మంత్రోపదేశం చేసినవాడు కాదు. ఈ దేహమే ఒక యంత్రము, హృదయమే ఒక తంత్రము. దీని నుండే 'సోహం' అనే మంత్రము బయలు దేరుతున్నది. ఇంతకంటే గొప్ప మంత్రము మన కెందుకు?!

నీ కన్నులు ఒక చెట్టుపైన పండును చూశాయి. తక్షణమే మనస్సు అది కావాలని ఆశించింది. కాని ఆశించిన తక్షణమే ఫలము వచ్చి కడుపులో చేరలేదు. కాళ్ళు చెట్టు దగ్గరకు నడిచాయి, నడుము వంగింది, చేయి రాయిని తీసుకుంది, భుజము దానిని విసిరింది, ఆ ఫలము క్రింద పడింది, దానిని నీ వ్రేళ్ళు పట్టుకొని నోటిలో పెట్టాయి, నోరు దానిని నమిలి జఠరాగ్నికి పంపింది. ఈవిధంగా చెట్టు పైనున్న పండు పొట్టలోకి చేరడానికి అన్ని అంగములూ సమానంగా పని చేశాయి. ఇందులో ఏ ఒక్క అంగము పని చేయకపోయినా చెట్టు పైనున్న ఫలము పొట్టలోకి చేరదు. పొట్టలో చేరిన తరువాత జఠరాగ్ని మంచి ఫలము తన కందినది కదా అని ఊరికే ఉండదు, దాని రసమును సర్వాంగములకు సప్లై చేస్తుంది. ఇట్టి కో-ఆపరేషన్‌ను బోధించేదే ధర్మము. కాని ఈనాడిట్టి కో - ఆపరేషన్ ఎక్కడా లేదు, అంతా ఆపరేషనే, ఆపరేషనే! కనుకనే సమాజంలో విచ్ఛిన్నకరమైన చర్యలు మితిమీరి పోతున్నాయి.

ఈనాడు జనులందరూ ధర్మపరులుగాను, సత్యవాక్పరిపాలకులుగానే కనిపిస్తుంటారు. కాని ఎవరు ఎలాంటివారో తెలుసుకోవడానికి వీలుకాదు. కొందరు ధర్మము చేసినా చేయనట్లుగా ఉంటారు, కొందరు చేయక పోయినా చేసినట్లు నటిస్తారు. ఒకానొక సమయంలో గోపికలు వచ్చినప్పుడు కృష్ణుడు నిద్రించినట్లుగా నటించాడు.

''మేను మరచి నిదురించేవారిని
మేలుకొలుప గలరు ఎవ్వరైనా
*కనులు మూసుకొని నిదుర నటించే
ఘనుని లేపగా ఎవరి తరము?
జాలమేలోయి కృష్ణా! లీలలు చాలోయి!''*

నిజంగా నిద్రించేవాడు రెండుతూర్లు కొడితే లేస్తాడు, మేలుకొన్నవాడు పిలుస్తే లేస్తాడు.

కాని నిద్రపోయినట్లు నటించే వానిని ఎవ్వరూ లేపలేరు. ఈనాడు ధర్మాచరణ కేవలం నటనగా కనిపిస్తున్నది. పవిత్రమైన గ్రంథములన్నీ పారాయణ నిమిత్తమై, ప్రచార నిమిత్తమై ఏర్పడినవని భావిస్తున్నారు. కాని ఇవన్నీ ఆచరణ నిమిత్తమై ఏర్పడినవే. ఈ సత్యాన్ని గుర్తించుకోలేని సాధకులు వీటిని కేవలం ఉదయం, సాయంకాలం పారాయణ చేస్తున్నారు. వేదము, ''సత్యం వద, ధర్మం చర'' అన్నది. అనగా సత్యమును చెప్పమని చెప్పిందిగాని ఆచరించమని చెప్పలేదు. ధర్మమును ఆచరించ మన్నదిగాని చెప్పమన లేదు. చెప్పేది నాలుక, చేసేది హస్తము. ఈ రెండింటితో మనస్సు ఏకం కావాలి. ఇదే నిజమైన ధర్మము. ఒక నిమిషం సత్యము, రెండో నిమిషం అసత్యము, ఒక నిమిషం ధర్మము, మరో నిమిషం అధర్మము - ఈవిధంగా ప్రవర్తించేవారు మానవులే కాదు.

సీతాకల్యాణం జరుగుతున్న సమయంలో జనక మహారాజు వచ్చి రామచంద్రునితో, ''ధర్మేచ అర్థేచ కామేచ...'' అని ప్రామిస్ చేయ మన్నాడు. ధర్మమంటే ఏ ధర్మము? ప్రాకృతమైన ధర్మమా? లేక అంతర్ముఖమైన ధర్మమా? ''ప్రాకృతమైన ధర్మములో ఆమె సుఖమే నా సుఖము, నాధనమే ఆమెధనము, ఆమె ఇష్టమే నా ఇష్టము. ఈ మూడింటికీ నేను ఒప్పుకుంటానుగాని, సమాజధర్మానికి అడ్డు తగిలితే సీతనైనా వదులుతానుకాని సమాజమును వదలను'' అన్నాడు. కనుకనే ఎవడో చాకలి వచ్చి, పదినెలలు లంకలో ఉన్న సీతను రాముడు తెచ్చుకున్నాడని విమర్శించేసరికి తక్షణమే సీతను త్యజించాడు. సత్యవాక్పరిపాలకుడు రాముడు. తాను ఇచ్చిన మాటనేగాక తన తండ్రి ఇచ్చిన మాటను కూడా నిలబెట్టాడు. తండ్రియే పుత్రుని రూపములో జన్మిస్తాడు గనుక, దశరథుడే తన రూపములో పుట్టాడనీ, దశరథుడు ఇచ్చిన మాట, తాను ఇచ్చిన మాట వేరు కాదనీ గుర్తించి సత్యాన్ని పాలిస్తూ వచ్చాడు. ఇదే నిజమైన ధర్మము.

ఈ కలియుగంలో ఆయుఃప్రమాణము చాల తక్కువ. ద్వాపరయుగంలోనైతే ఆయుః ప్రమాణము కొంత ఎక్కువగా ఉండేది. మహాభారత యుద్ధంలో కౌరవుల కమాండర్-ఇన్-చీఫ్‌గా నిలచిన భీష్మునికి 112 సం॥లు. కృష్ణునికి 76 సం॥లు, అర్జునునికి 74 సం॥లు. అయినప్పటికీ వారు మంచి యౌవనంలో ఉన్నారు. ఈనాడయితే 17 ఏళ్ళు వచ్చిన వారిని యువకులంటాముకాని, ఆనాడు 70 ఏళ్ళు వచ్చినా యువకులే! దీనికి కారణం వారి హృదయ పవిత్రతయే. పవిత్రత, సహనం, పట్టుదల - ఈ మూడూ ఉండటంచేతనే వారు ఎంత వయస్సు వచ్చినా మంచి యౌవనంలోనే ఉన్నారు. కాని ఈ కలియుగంలో అన్నీ మార్పులు చెందినాయి. ఈనాడు దైవచింతన చేయాలంటే ఎన్నో ఆటంకములు ఎదురవుతుంటాయి, దైవమందిరాలు కట్టాలంటే ఎన్నో కలహాలు జరుగుతుంటాయి. సమాజంలో ఎక్కడ చూసినా Law & Order పూర్తిగా పోయింది. ఈ Law & Order తిరిగి రావాలంటే మనలో మొట్టమొదట Love & Action కావాలి.

*(తేది: **24.7.96**న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్య సందేశము నుండి)*

# కొడైకెనాల్‌లో శ్రీవారు

అందాలు చిందే కొడైకెనాల్ పర్వతవాటికలో ఏప్రిల్20 నుండి మే 11 వరకు భగవాన్‌బాబావారు గడిపిన మూడు వారాలలో వారి పాదపద్మముల చెంత చేరి, వారి దివ్యసందేశాలను వీనులవిందుగా విని దేశ, విదేశ భక్తులు పొందిన ఆనందానుభూతి వర్ణనాతీతము. శ్రీవారి రాకకు ముందు చాలారోజులుగా వర్షానికి నోచుకోని కొడైకెనాల్, శ్రీవారు అడుగుపెడుతూనే కుంభవృష్టిని చవి చూసింది. ప్రతిరోజు వానజల్లులు పడుతున్నప్పటికీ శ్రీవారి కార్యక్రమాలు ఎట్టి అంతరాయమూ లేకుండా కొనసాగాయి, భక్తులందరికీ దర్శనస్పర్శన సంభాషణాదులు పుష్కలంగా లభించాయి.

ఏప్రిల్23 నుండి మే9 వరకు ప్రతిరోజు సాయంకాలం శ్రీవారు భక్తుల నుద్దేశించి అనుగ్రహ భాషణం సల్పారు. భగవానుని వెంట కొడైకెనాల్‌కు వెళ్ళే అదృష్టానికి నోచుకున్న పదిమంది విద్యార్థులలో ఒకరు, తరువాత స్వామిభక్తులలో ఒక్కరో ఇద్దరో శ్రీవారి దివ్యసందేశానికి ముందుగా ప్రసంగించేవారు.

శ్రీవారు తమ ప్రథమసందేశంలో వాక్కుకు గల మహత్తర శక్తిని వివరించారు. వాక్కే ఆనందాన్ని, విషాదాన్ని, భయాన్ని, నిర్భయాన్ని కలిగిస్తుందన్నారు. కలియుగంలో నామస్మరణే ఆత్మానుభూతికి అత్యంత సులభోపాయమని వచించారు. పరమ భక్తాగ్రేసరులైన త్యాగరాజు, సూరదాసు, తులసీదాసుల జీవితవిశేషాలను వివరించారు. అన్ని దివ్యోపన్యాసాలలోను ప్రేమయే అంతర్వాహినిగా తనరారింది. భగవంతుని నుండి భక్తులు కోరవలసినవి రెండే రెండనీ, ఒకటి ప్రేమ, రెండవది ఆనందమనీ అన్నారు. భగవంతుని ప్రేమ ఒక్క సేవ వల్లనే లభిస్తుందని నొక్కిచెప్పారు.

భగవాన్‌బాబావారు కొడైకెనాల్‌లో ఉన్న రోజులలో అక్కడి భక్తులకు స్వామిసన్నిధిలో రెండు పర్వదినములను జరుపుకొనే అవకాశం లభించింది. ఒకటి ఏప్రిల్ 26వ తేదీన వైట్‌ఫీల్డ్‌లో స్వామినివాసమైన త్రయీబృందావనం వార్షికోత్సవము, రెండవది మే6వ తేదీన విశ్వజనని ఈశ్వరాంబ దినోత్సవము. ఆ రెండు రోజులు భక్తులందరికీ ప్రసాదవితరణ జరిగింది. ఈశ్వరమ్మ దినోత్సవ సందర్భంగా పేదలకు నూతన వస్త్రాలు, బ్లాంకెట్లు పంచిపెట్టబడ్డాయి. శ్రీవారి పర్యవేక్షణలో ఈ కార్యక్రమం దాదాపు రెండు గంటలపాటు జరిగింది. సాయంత్రం శ్రీవారు తమ దివ్యోపన్యాసంలో పిల్లలను ఆదర్శవంతులుగా తీర్చిదిద్దడంలో తల్లుల బాధ్యతను గూర్చి సుదీర్ఘంగా ముచ్చటించారు. మే 7వ తేదీన మధురైకి వెళ్ళి అక్కడ నూతనంగా నిర్మింపబడిన సత్యసాయి మందిరానికి ప్రారంభోత్సవం జరిపారు. కుంభవృష్టిని సైతం లెక్కచేయక భక్తులు అధిక సంఖ్యలో గుమికూడి శ్రీవారి దివ్యదర్శన భాగ్యాన్ని పొందారు. శ్రీవారు కొడైకెనాల్ నుండి మే 11వ తేది ఉదయం బయలుదేరి సాయంత్రానికి బృందావనం చేరుకున్నారు.

డా॥ ఆర్. శ్రీరామరాజు (ప్రశాంతి నిలయం)

# సత్యోపనిషత్

(గత సంచిక తరువాయి)

44. స్వామీ! అనాత్మభావమే మాయ అని, నేను కాని దానిని నేననుకోవడమే మాయ అని అన్నారు. మరి ఈ 'నేను' అనేదే 'ఆత్మ' అని తెలుసుకోవడం ఎలా?

బాబా: 'నేను' అనేదే ఆత్మ, మరేదీ కాదు. దీనిని తెలుసుకోవడాన్ని ఆత్మవిచారణ (*Self enquiry*) అన్నారు. ఇది ఆధ్యాత్మికమార్గంలో అత్యవసరం. పూజలు, జపధ్యానాదులు ఆధ్యాత్మికం కావు. అవి సత్కర్మలు మాత్రమే. అయితే కాలాన్ని సార్థకం గావించుకునే నిమిత్తం అవి అవసరం. కనుక వాటిని వదలివేయమని నేను చెప్పటం లేదు. కాని ఆత్మవిచారణయే అసలైన ఆధ్యాత్మికం. ఇది నా దృష్టిలో చాల తేలిక. కాని సరిగ్గా చెప్పేవారు లేకపోవడంచేత ఈనాడు అనేకమంది ఆధ్యాత్మిక మార్గం కఠిన మనుకుంటున్నారు.

*Who are you?* (ఎవరు నీవు?) అని ఎవరైనా ప్రశ్నించినప్పుడు, ''నేను భారతీయుడను'' అని కొందరంటారు. ఇది సరియైన సమాధానం కాదు. నీవు ఉంటున్న దేశం నీవెలా అవుతావు? ఇదే ప్రశ్నకు ఇంకొందరు, ''నేను ఇంజనీరును'', ''నేను డాక్టర్‌ను'' అని సమాధానం చెబుతారు. ఇది కూడా సరియైన సమాధానం కాదు. నీ విద్యాభ్యాసం తరువాత నీవు చేపట్టిన వృత్తి ఇది. ఇట్టి వృత్తి నీవెలా అవుతావు? ''ఎవరు నీవు?'' అన్న ప్రశ్నకు ఇంకొందరు, ''నేను రామారావుని'', ''నేను వేంకటేశ్వ్రరావుని'' అని చెబుతారు. ఇది కూడా తప్పే. ఈ పేర్లు పెట్టినవేకాని పుట్టినవి కాదు. పుట్టుకతో నీవేమీ బోర్డు తగిలించుకొని పుట్టలేదు కదా! ఇవి నీ తల్లిదండ్రులు నీకు పెట్టిన పేర్లు. పైగా నీవే పేరైనా మార్చుకోవచ్చు. కనుక నీకు పెట్టిన పేర్లు నీవెలా అవుతావు?

''నీవెవరు?'' అన్న ప్రశ్నకు మరికొందరు, ''నేను యువకుడను,'', ''నేను వృద్ధుడను'' అని చెబుతారు. ఇవి కూడా సరియైన సమాధానాలు కావు. ఎందుచేత? జాగ్రత్తగా గమనించు. ఈనాటి పిల్లవాడు కొంతకాలానికి తండ్రి, మరికొంతకాలానికి అతడే తాత అవుతున్నాడు. ఇక్కడ వ్యక్తి ఒక్కడే, ముగ్గురు లేరు. బాల్యం, యౌవనం, వార్థక్యం ఇవన్నీ కాలం తెచ్చిన మార్పులేగాని, నీవొక్కడివే కదా!

''నీవెవరు?'' అన్నప్పుడు కొందరు శరీరం యొక్క ఛాయ, ఎత్తు, బరువు గురించి చెబుతూ, ''నేను శరీరమును'' అనవచ్చు. కాని ఇది సరియైనది కాదు. ఎందుచేత? స్వప్నావస్థలో నీ శరీరం లేదు. అక్కడ నీ మనస్సే నిన్ను సృష్టించింది. అప్పుడు నీవు శరీరం ఎలా అవుతావు? కనుక ఈ శరీరం నీదికాని, నీవు శరీరం కాదు. ఇంకొందరు,

''మనస్సును నేను'' అనుకుంటారు. గాఢనిద్ర (సుషుప్తి)లో మనస్సు లేదు కదా! మనస్సే నీవైతే గాఢనిద్రలో ఎక్కడికి పోయావు నీ శరీరాన్ని మంచంపై పడుకోబెట్టి? కనుక మనస్సు నీవు కాదు, మనస్సు నీది. పోనీ 'నేను' అనేది బుద్ధి అనుకుందాం. అదీ తప్పే! ఎందుచేత? బుద్ధి అనేది విచక్షణాశక్తి, నిర్ణయాత్మకశక్తి కలిగిన భగవత్ప్రసాదితమైన పనిముట్టు (శరీరము, మనస్సువలె). కాని ఇది స్థిరంగా ఉండదు. ఇది ఒకప్పుడు స్వార్థంతో వ్యవహరించి నిర్ణయం చేస్తుంది **(Individual Discrimination).** ఇదే బుద్ధి మరొకప్పుడు నిస్స్వార్థమైన, సర్వులకు శ్రేయోదాయకమైన విచక్షణాశక్తి**(Fundamental Discrimination)**ని కూడా ప్రదర్శించగలదు. పైగా ఈ బుద్ధి గాఢనిద్రలో ఉండదు. ఈవిధంగా విచారణ చేస్తే నీవు దేహం కాదు, మనస్సు కాదు, బుద్ధి కాదు. కనుక, ''నీవెవరివి?'' అనే ప్రశ్నకు మిగిలిన సమాధానమేమిటి? ''నేను ఆత్మను.'' ఇదే సరియైన సమాధానం. ఇది సాక్షీభూతము. నీవు మేల్కొని ఉన్నా, కలగంటున్నా, నిద్రిస్తున్నా సర్వకాల సర్వావస్థలయందు ఉండేది ఇదే. ఏ దేశంలో ఉన్నా, ఏ వృత్తిలో ఉన్నా, ఏ పేరు పెట్టుకున్నా ఉండేది ఇదే. కనుక ''నీవెవరివి?'' అనే ప్రశ్నకు, ''ఆత్మ'' అనే సమాధానమే కరెక్టు. దీనినే ఆత్మవిచారణ అంటారు. ఇదే ఆధ్యాత్మికం.

**45.** ఎంత గొప్ప విషయాలు చెప్పారు భగవాన్! మహదానందంగా ఉంది. మీకు మీరే సాటి. ఇంత సరళంగా, వివరంగా భగవంతుడైన మీరే చెప్పాలిగాని ఇతరులకు సాధ్యమయ్యే విషయం కాదు. ఈ ప్రశ్నకు క్షమించండి. ఎంతో అందంగా, విపులంగా మీరు వివరించారుగాని, ఈ ఆత్మవిచారణామార్గంలో నా మనస్సును నిలుపలేక పోతున్నాను. ఎందుకని నా మనస్సు ఏకాగ్రత పొందటం లేదు? చంచలత్వము మనస్సుకు సహజమా? అందువల్లనే మనస్సుకు నిలుపలేకపోతున్నా నంటారా?

బాబా: ''మనస్సును నిలుపలేక పోతున్నాను. మనస్సు ఏకాగ్రతతో ఉండటం లేదు'' అని అంటున్నావు. ఇది సత్యం కాదు. దారముల చేరికచేత వస్త్రము ఏర్పడినట్లుగా, కోరికల చేరికచేత మనస్సు ఏర్పడింది. దారములను లాగివేస్తే వస్త్రముండదు కదా! అలాగే కోరికలు లేనప్పుడు మనస్సే లేదు. పైగా నీ మనస్సు చలిస్తున్న దంటున్నావు. ఇది నిజం కాదు. చెట్టు యొక్క ఆకులు గాలి వీచినప్పుడు కదులుతాయి, లేనప్పుడు లేదు. అదేవిధంగా కోరికలనే గాలి వీచడంచేతనే నీ మనస్సు చలిస్తున్నది. ఇంక, ''మనస్సును నిలుపలేక పోతున్నాను, ఏకాగ్రత కుదరటం లేదు'' అంటున్నావు. ఇదీ నిజం కాదు. సైకిల్ త్రొక్కుతున్నప్పుడు, కారు నడుపుతున్నప్పుడు నీకు ఏకాగ్రత ఎక్కడి నుండి వచ్చింది? పుస్తకం చదివి విషయాన్ని గ్రహించగల్గుతున్నావు కదా! అప్పుడు నీ మనస్సు ఎలా లగ్నమైంది? మనస్సు ఎక్కడో పెట్టుకొని ఉద్యోగం చేస్తే పని పాడయిపోతుంది,

ఉద్యోగం పోతుంది. మరి ఉద్యోగం చేస్తూనే ఉన్నావే! అందులో మనస్సును ఎలా నిలుపగల్గుతున్నావు? అన్ని రంగాల్లోను సునాయాసంగా మనస్సును లగ్నం చేస్తున్నావుకాని, భగవద్విషయంలో మాత్రం కుదరటం లేదంటున్నావు. ఇదెంతటి దురదృష్టం! అంటే ఇతర విషయాలపై ఉన్న ప్రేమ, ఆసక్తి దైవసంబంధమైన విషయాలపై లేదన్నమాట.

46. చిత్తశుద్ధి అని అంటారే! అదెలా సాధ్యం స్వామీ!

బాబా: చిత్తము నీవల్లనే మాలిన్యమవుతున్నదికాని, లేకపోతే అది ఎప్పుడూ పరిశుద్ధంగానే ఉంటుంది. ఉదాహరణకి ఈ కర్చీఫును తీసుకుందాం. ఇది తెల్లగా, స్వచ్ఛంగా ఉంది. దీనిని కొంతకాలం ఉపయోగించుకున్నావు. అప్పుడేమైంది? మలినమైపోయింది. అప్పుడు దీనిని చాకలివానికి వేస్తే వాడు శుభ్రంగా ఉతికి తెల్లగా చేసి నీకిస్తాడు. అంటే వాడు దీనికేమైనా తెల్లరంగు వేశాడా? లేదు, లేదు. అసలు మొదట్లో కర్చీఫు తెల్లగానే ఉందికాని, వాడకంవల్ల నల్లబడింది. దానిని చాకలివాడు ఉతికేసరికి తిరిగి యథాప్రకారంగా తెల్లగా తయారైనది. అలాగే చిత్తము కూడా ఎప్పుడూ శుద్ధమే, స్వచ్ఛమే. కాని నీ కోరికలవల్ల, సంకల్పాలవల్ల అది మాలిన్యమవుతున్నది. కనుక కోరికలను నిర్మూలిస్తే, సత్సంకల్పాలను కలిగియుంటే చిత్తము దాని సహజమైన, స్వచ్ఛమైన స్థితిలోనే ఉంటుంది. కనుక చిత్తశుద్ధి అంటే కోరికలను అదుపులో నుంచుకోవడం, సత్సంకల్పాలను కలిగియుండటం అన్నమాట!

47. స్వామీ! చిత్తము దుష్టసంకల్పాలవల్ల, దుష్కర్మలవల్ల మాలిన్యమౌతుందని శెలవిచ్చారు. మరి నా అవలక్షణాలనండీ, బలహీనతలనండీ, దుర్గుణాలనండీ అవి పోయేదెలా? అవి పోతేగాని తమరు శెలవిచ్చినట్లు చిత్తశుద్ధి కలుగదాయె. నా దుర్గుణాల నరికట్టే దెట్లా స్వామీ?

బాబా: నీవు పామును త్రాడనుకొని దానికి దగ్గర్లో తిరుగుతున్నావు, దానిని పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నావు. అది త్రాడు కాదు, పాము అని తెలిస్తే దాని దరిదాపుల్లో కూడా ఉండవు. అట్లాగే నీ దుర్గుణములు, దుష్కర్మలు ఎంత ప్రమాదకరమో నీకు తెలిస్తే వాటిని తప్పక నీవే తొలగించుకుంటావు. త్రాడు అనుకొని పట్టుకోబోతావు, పాము అని తెలియగానే ఠక్కున వదిలేసి పారిపోతావు. అలాగే దుర్గుణాలలో సుఖముందనుకున్నప్పుడు వాటిని అంటిపెట్టుకొని ఉంటావు. అవి ప్రమాదకరం అని తెలిస్తే వెంటనే వదలివేస్తావు. కనుక మొట్టమొదట దుర్గుణాలు ప్రమాదకరమని తెలుసుకోవాలి. వాటిని క్రమేణ వదల్చుకోవాలి. కొందరు తమ దురలవాట్లను కొంతకాలంపాటు నిష్ఠతో వదలివేసి ఆ నిష్ఠాకాలం పూర్తవ్వగానే ఇంకా జోరుగా కొనసాగిస్తారు. ఇది చాల తప్పు. ఫ్యాన్‌స్విచ్ ఆపివేస్తే ఫ్యాను క్రమేణ ఎలా నిల్చిపోతుందో అలాగే నీ దుర్గుణాలను, వాటివల్ల వచ్చే అరిష్టాలను గ్రహించి మెల్లగా తగ్గించుకుంటూ రావాలి. ఈ ప్రయత్నానికి దైవానుగ్రహం తప్పక తోడవుతుంది.

(సశేషం)

బుద్ధపూర్ణిమ సందేశం

# రాగమే రోగము, విరాగమే నిర్వాణము

ప్రేమస్వరూపులారా! జ్ఞానమనగా గ్రంథ పరిచయం కాదు, ప్రాకృతమైన విషయాలను తెలుసుకోవడం కాదు. వ్యక్తికి, సమిష్టికి మధ్యనున్న ఏకత్వాన్ని గుర్తించడమే నిజమైన జ్ఞానము. జీవేశ్వర ఏకత్వాన్ని గుర్తించినవాడే నిజమైన జ్ఞాని. మానవుడు తనలోని మానవత్వాన్నే గుర్తించ లేనప్పుడు ఇంక తనలోని దైవత్వాన్ని ఏరీతిగా గుర్తించగలడు? కనుక ప్రప్రథమంగా తనలోని మానవత్వాన్ని గుర్తించాలి. దీనిని పురస్కరించు కొనియే బుద్ధుడు మొట్టమొదట సమ్యక్‌దృష్టిని అలవర్చుకోవాలని బోధించాడు. కన్నులున్నవి కదా అని అందరినీ చూడకూడదు, అన్నింటినీ చూడకూడదు. చూసిన దృశ్యములన్నీ మనలో నిలచిపోతాయి. అపవిత్రమైన దృశ్యములను చూడటంవల్ల మనలో అనేక దోషములు, పాపములు ప్రవేశిస్తాయి. కాబట్టి పవిత్రమైన దృశ్యములను మాత్రమే చూడాలి. అంతరాత్మకు ఏది తృప్తికరంగా ఉంటుందో దానిని మాత్రమే దర్శించాలి. ఇట్టి సమ్యక్‌దృష్టిని అలవర్చుకున్నప్పుడే మనలో సమ్యక్ సంకల్పములు ఆవిర్భవిస్తాయి. మూడవది సమ్యక్ వాక్కు. పరులను నిందించకుండా, పరులను బాధించకుండా, అసత్య మాడకుండా నాలుకను పవిత్రం గావించుకోవాలి. నాలుక ఉన్నది ఎందుకోసం? రుచికరమైన పదార్థములను తినటంకోసమా? పరదూషణ చేయటంకోసమా? కాదు, కాదు, కాదు. నాలుక చాల మధురమైనది, గౌరవనీయమైనది, పవిత్రమైనది. కనుక ఇట్టి నాలుక చేయవలసిన పని ఏమిటి? గోవిందా! దామోదరా! మాధవా! అని ఉచ్చరించాలి. ఇందుకోసమే మనకు నాలుక ఇవ్వబడినది. కాని కొందరు ఎదురుపడిన ప్రతివాడితో మాట్లాడటమే! ఎవడు చిక్కితే వాడితో మాట్లాడటమే! ఇదెంత చెడ్డ పని! ఇతరులతో అనవసరంగా మాటలాడటంవల్ల దివ్యమైన ఎనర్జీ ఎంత వ్యర్థమైపోతున్నదో!

నాల్గవది సమ్యక్ శ్రుతి. అపవిత్రమైన విషయాలను వింటే అపవిత్రమైన సంకల్పములే మనలో ఆవిర్భవిస్తాయి. కనుక పవిత్రమైన విషయాలను మాత్రమే వినాలి. ఈ నాల్గింటితోపాటు సమ్యక్ కర్మలను కూడా ఆచరించాలి. ఆరవది సమ్యక్ జీవనం. ప్రాకృతమైన విషయవాంఛలతో జీవితాన్ని వ్యర్థం చేసుకోరాదు. ఆదర్శవంతమైన నడతను కలిగియుండాలి. ఏడవది సమ్యక్ సాధన. జపము, ధ్యానము, భజన మున్నగునవి సత్కర్మలే కాని సాధనలు కావు. దుర్భావములను దూరం గావించుకొని సద్భావములను పోషించుకోవడమే సరియైన సాధన. సమ్యక్ సాధనవల్ల మనలో మానవతా గుణములు అభివృద్ధి అవుతాయి. దీని తరువాతనే సమ్యక్ సమాధి ప్రాప్తిస్తుంది. సమ - ధీ అనగా, సమబుద్ధిని కల్గియుండటమే సమాధి. సుఖదుఃఖములను, నిందాస్తుతులను, చీకటి వెలుగులను, లాభనష్టములను సమంగా భావించుకోవడమే సమాధి. ఇట్టి ఏకత్వ భావనయే నిర్వాణము.

బుద్ధుడు యజ్ఞయాగాది క్రతువులను విశ్వసించ లేదు. కారణ మేమనగా మొట్టమొదట మానవుడు భగవంతుడు తనకు అనుగ్రహించిన పంచేంద్రియములను సార్థకం గావించుకోవాలని భావించాడు. బుద్ధుడు వేదమునుగాని, యజ్ఞ యాగాదిక్రతువులనుగాని విశ్వసించక పోవడంచేత అందరూ అతనిని నాస్తికుడని పిలుస్తూ వచ్చారు. ఇది పరమ అధర్మం. బుద్ధుడు పవిత్రమైన చిత్తము కలిగినటువంటివాడు. వృద్ధులను, కష్టజీవులను చూసి చాల బాధపడేవాడు. పెద్దచేప చిన్న చేపను మ్రింగినట్లుగా అధికారులు, పెద్దలు తమ క్రిందివారిని హింసించడం చూసి చాల విచారించేవాడు. మృతదేహమును చూసి చాల దుఃఖించేవాడు. ఈ ప్రాకృతమైన జీవితం అతని కేమాత్రము తృప్తిని కల్గించ లేదు. సూర్య చంద్రాదులకు, పంచభూతములకు అతీతమైన తత్వాన్ని గుర్తించాలని అనేక సాధనలు సల్పాడు. కడపటికి విసుగుచెంది అనేకమంది మహనీయులను దర్శించి ఈ సృష్టికి మూలాధార మేమిటో తెలియజేయవలసిందిగా కోరాడు. కాని ఎవ్వరూ అతనికి తగిన సమాధానము నివ్వలేకపోయారు. చివరికి గయను చేరుకొని అక్కడొక వటవృక్షము క్రింద కూర్చుని అనేక విధములుగా విచారణ సల్పాడు. సత్యమే భగవంతుడని గుర్తించాడు. మనోవాక్కర్మలచేత పరులను బాధించకుండా ఉండటమే నిజమైన ధర్మమని విశ్వసించాడు. ''అహింసా పరమో ధర్మః'' అని ప్రబోధించాడు. బుద్ధుని ప్రబోధలలో ప్రధాన మైనవి సత్యము, ధర్మము. ఆడినమాట తప్ప కూడదు, హింస చేయకూడదు. దీనినే ''సత్యం వద, ధర్మం చర'' అని వేదము కూడా బోధించింది.

బుద్ధునికి మొట్టమొదట పెట్టిన పేరు సర్వార్థసిద్ధుడు. ఇతడు పుట్టిన ఏడవ దినమే తల్లియైన మాయాదేవి మరణించింది. శుద్ధోధనుని రెండవ భార్యయైన గౌతమి ఇతనిని అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసింది. కనుకనే ఇతనికి గౌతమబుద్ధుడు అని పేరు వచ్చింది. ఇతడు పుట్టినప్పుడు ఒక జ్యోతిష్యుడు వచ్చి, ''ఇతడు గొప్ప మహారాజైనా కావాలి. లేక పూర్ణవిరాగియైనా కావాలి'' అని చెప్పాడు. ఈ విషయాన్ని తెల్సుకొని శుద్ధోధనుడు తన కుమారుని ఎక్కడికీ పంపలేదు. బయటికి వెళ్ళినప్పుడు ఏ వృద్ధుడైనా, ఏ మృతదేహమైనా అతని కంటపడితే వైరాగ్యంతో ఇల్లు వదలి పోతాడేమో నన్న భయంతో ఈ ప్రాకృతమైన వికారములు అతని కంట పడకుండా చేశాడు, యుక్తవయస్సు రాగానే సుప్రబుద్ధుడనే తన బావమరిది కుమార్తె యైన యశోధర నిచ్చి వివాహం చేశాడు. వివాహమైతే తన కుమారుడు విరాగిగా మారటానికి అవకాశం లేదని భావించాడు. కాని సిద్ధార్థుడు కడపటికి సత్యాన్ని గుర్తించాడు. ''నా తల్లిదండ్రులు, బంధువులు, ప్రజలు అందరూ కలసి నాకు వివాహం చేసి నన్ను బంధనలో ముంచారు'' అని చాల విచారించాడు. తన 28వ ఏట ఒకనాటి అర్ధరాత్రి సమయంలో భార్యయైన యశోధరను, కుమారుడైన రాహులుని త్యజించి సర్వసంగ పరిత్యాగియై అరణ్యంలో ప్రవేశించాడు.

'మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధు సహోదరః
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రత'
'జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖం పునఃపునః
అంత్య కాలేషు మహాదుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత'

అని తన హృదయానికి తాను బోధించుకున్నాడు.

బంధుమిత్రులే మానవుని బంధనలకు మూల కారణమనీ, ఈ బంధనలే మానవునికి దుఃఖమును చేకూర్చుతున్నవనీ గుర్తించాడు. కనుకనే సర్వం దుఃఖం, దుఃఖం - సర్వం క్షణికం, క్షణికం - సర్వం నశ్యం, నశ్యం అని చాటి చెప్పాడు. ఈ ప్రాకృతమునకు అతీతమైన తత్వాన్ని గుర్తించాలని సంకల్పించుకున్నాడు.

ఈనాడు తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రాకృతమైన మార్గంలో ప్రవేశపెట్టి తమతోపాటు వారిని కూడా భరించలేని బాధలకు గురి చేస్తున్నారు. పిల్లలకు ఒక వయస్సు వస్తూనే వారికి వివాహం చేసి బంధనలో ముంచాలనే దుర్భావము తల్లిదండ్రులలో ప్రారంభమౌతున్నది. పెద్దలు పిల్లలను బంధనలో ముంచుతున్నారు. పైగా అదేదో ప్రేమ అని భావిస్తున్నారు. అది ప్రేమ కానే కాదు. ''నాయనా! నీవు పెళ్ళి చేసుకో, పెళ్ళి చేసుకో'' అని కుమారుని బలవంతం చేయడం ప్రేమనా? కాదు, కాదు. పిల్లవానికి ఇష్టముంటే వాడే చేసుకుంటాడు. తల్లిదండ్రు లెందుకు వానిని ఫోర్స్ (బలవంతం) చేయడం? ఈ ఫోర్సే పెద్ద బంధన. బయటి ఫోర్స్‌ను కాదు, లోపలి సోర్స్ (అంతరాత్మ) ను అనుసరించాలి. ఇదే బుద్ధుని ప్రధానమైన బోధ. మనలోనున్న దివ్యత్వాన్ని నమ్మకుండా మనం లోకాన్ని నమ్ముతున్నాము. ఈ లోకంలో కనిపించేవన్నీ గాలిమేడలవంటివి, ఎండమావుల వంటివి. మిరాజ్(ఎండమావి)లో నీరున్నట్లే కనిపిస్తుందికాని, దగ్గరికి పోతే అక్కడ నీరుండదు. ఈ మ్యారేజి(Marriage) అనేది కూడా ఒక మిరాజ్ (Mirage) వంటిదే. ఇందులో ఏదో ఆనంద మున్నదని భ్రమించి దీనిని పట్టుకొని మనం లేనిపోని అవస్థలకు గురియైపోతున్నాము. మనం మానవులుగా పుట్టాముకాని పశువులుగా కాదు కదా! మరెందుకు ఇంద్రియాలను నిగ్రహించుకో కూడదు? ఇంక మన చదువెందుకు? తెలివి తేటలెందుకు? అన్నీ వ్యర్థమైనవే! అసలు ఈ మ్యారేజివల్ల తాము పొందిన సుఖమేమిటని తల్లిదండ్రులు కూడా విచారించటం లేదు. ఇదే పెద్ద అజ్ఞానము. తల్లిదండ్రులు ఎంత సుఖమును అనుభవించారు? ఏ సుఖమును అనుభవించారు? శారీరక సుఖమా? మానసిక సుఖమా? ఏమీ లేదు. గొప్ప విద్యావంతులు, మేధావులు కూడా ఈ సత్యాన్ని గుర్తించడానికి ప్రయత్నించక అపవిత్రమైన మార్గంలో ప్రవేశిస్తున్నారు. క్షణికమైన ఇంద్రియ సుఖములను మాత్రమే ఆశిస్తున్నారుకాని, శాశ్వతమైన ఇంద్రియా తీతమైన దివ్యత్వాన్ని ఆశించడం లేదు. ఏమిటీ జీవితం? ఎక్కడుంది సుఖము? సంసారంలో ఉందా? చదువులో ఉందా? ఉద్యోగంలో ఉందా? వ్యాపారంలో ఉందా? ఎందులోను లేదు. ఇవన్నీ క్షణికమైన సుఖములు. ఇదంతా మిథ్యము, మిథ్యము, మిథ్యము! పోయే సమయంలో ఎవరు మనలను రక్షిస్తున్నారు? ఏది మన వెంట వస్తున్నది? ఎవ్వరూ రక్షించడం లేదు, ఏదీ వెంట రావటం లేదు. మన ఇంట వెంట జంట ఉండేది దైవత్వం ఒక్కటే. ఈ ప్రాకృత మైనవన్నీ మనలను ముంచేటటువంటివే. ఈ జగత్తు తేనె పూసిన కత్తివంటిది. ఆ తేనెను నాకడానికి ప్రయత్నిస్తే నాలుకను కోసివేస్తుంది. మనం ఇంద్రియ భోగాలను అనుభవించేకొలది బలహీనులమౌ తున్నామేకాని బలవంతులం కావటం లేదు.

బుద్ధుడు సన్యసించిన తరువాత శుద్ధోధనుడు వచ్చి, ''నాయనా! నేను మహా రాజును, నీవు కూడా మహారాజు కావలసిన

వాడవు. అలాంటి నీవు భిక్షమెత్తుకొని తిరగడమేమిటి?'' అని చాల బాధపడ్డాడు. అప్పుడు బుద్ధుడు, ''అయ్యా! నీవు తండ్రివి కాదు, నేను కుమారుడను కాదు. ఇరువురము బ్రహ్మ స్వరూపులమే. అయితే ప్రాకృతమైన రీతిలో నీవు మహారాజువు, నేను విరాగిని. నీది రాగము, నాది విరాగము. రాగమే పెద్ద రోగము, విరాగమే నిర్వాణము'' అని సూటియైన సమాధాన మిచ్చాడు.

*''బుద్ధం శరణం గచ్ఛామి*
*ధర్మం శరణం గచ్ఛామి*
*సంఘం శరణం గచ్ఛామి''*

దీని అంతరార్థ మేమిటి? మొట్టమొదట మన బుద్ధిని ధర్మమార్గంలో ప్రవేశ పెట్టాలి. తదుపరి ధర్మాన్ని సంఘంలో ప్రవేశపెట్టాలి. బుద్ధిని ధర్మంలోను, ధర్మమును సంఘంలోను ప్రవేశ పెట్టినప్పుడే జీవితం సార్థక మవుతుంది. సొసైటీలో మనం సభ్యులుగా ఉన్నాము. కనుక సొసైటీ బాగుపడినప్పుడే మనం కూడా బాగుపడగలము. ''హేండ్స్ ఇన్ ది సొసైటీ, హెడ్ ఇన్ ది ఫారెస్ట్'' అనగా చేతులు సమాజసేవలోను, తల ఆధ్యాత్మిక చింతనలోను నిమగ్నం కావాలి.

బుద్ధుడు లౌకికమైన సాధనలను అంగీకరించ లేదు. ఇవన్నీ ప్రవృత్తి లక్షణాలు. అతని హృదయం నివృత్తి తత్త్వంలో ప్రవేశించింది. ఒక్క దైవమునుగాని, ఒక్క శాస్త్రమునుగాని అతడు ప్రస్తావించ లేదు. యజ్ఞమంటే ఏమిటని విచారణ సల్పి, త్యాగమే నిజమైన యజ్ఞమని గుర్తించాడు. ''త్యాగేనైకే అమృతత్వ మానశుః'' త్యాగము చేసినప్పుడే మనం ఉన్నతస్థాయికి వెళ్ళగలము. నీటిలో ఈదేటప్పుడు ముందున్న జలమును వెనుకకు నెట్టినప్పుడే ముందుకు పోగల్గుతున్నాము కదా! అదేవిధంగా త్యాగం చేసినప్పుడే యోగములో ముందుకు పోగలము. అదే నిర్వాణము. దీనికి ప్రేమయే ప్రధానం. ప్రేమ లేకుండా దేనినీ సాధించ లేము.

అన్ని యుగములలోను అవతార పురుషులు అనేక ఆదర్శములను నిరూపించారు. ఈనాడు మనం అవతార పురుషుల జన్మదినోత్సవములను జరుపుకుంటున్నామేగాని, వారు ప్రబోధించిన విషయాలను ఆచరించడం లేదు. సత్యధర్మముల నాధారంగా చేసుకొనియే బుద్ధుడు తన ప్రచార ప్రబోధలు సల్పుతూ వచ్చాడు. టిబెట్, చైనా, బర్మా, జపాన్ ఇత్యాది రాజ్యాలలో బుద్ధుని సందేశం వ్యాప్తి నొందింది. కాని బుద్ధుని తరువాత అతని అనుయాయులలో అంతఃకలహాలు ప్రారంభం కావడంచేత బౌద్ధమతం కొంతవరకు క్షీణిస్తూ వచ్చింది. వారు భౌతిక జీవితమునే విశ్వసించి బుద్ధుని సత్యవాక్కులను విస్మరించారు. అవతార పురుషుల చరిత్రను పారాయణ చేసినంత మాత్రమున చాలదు. అందులో ఏ ఒక్కటి రెండైనా ఆచరణలో పెట్టాలి. ఎన్ని దినములైనప్పటికీ మీరు ప్రాకృతమైన ప్రేమను పెంచుకుంటున్నారేగాని, దైవసంబంధమైన ప్రేమను పెంచుకోవడం లేదు. క్రమక్రమేణ మీరు వైరాగ్యంలోకి ప్రవేశించాలి. గ్రంథాలు చదవాలి. చదివినంత మాత్రమున చాలదు, అర్థమును తెలుసుకోవాలి. అర్థమును తెలుసుకున్నంత మాత్రమున చాలదు, మననం చేయాలి. మననం చేసినంత మాత్రమున చాలదు, ఆచరణలో పెట్టాలి. దైవాన్ని స్మరించని బ్రతుకు బ్రతుకు కాదు, నీతినిజాయతీలు లేని బ్రతుకు బ్రతుకు కాదు. నీతినిజాయతీలే

నిర్వాణమునకు సోపానములు. నీతినిజాయతీలు గలవాడే అవధూత, లేనివాడు యమదూత.

ప్రేమస్వరూపులారా! ఈనాడు మీరు బుద్ధపూర్ణిమను జరుపుకుంటున్నారు. అసలు పూర్ణిమంటే ఏమిటో మీరు తెలుసుకోవాలి. ''చంద్రమా మనసో జాతః'', మన మనస్సే చంద్రుడు. ఇది పరిపూర్ణమైన ప్రేమతో నిండిన దినమే పూర్ణిమ. మనస్సులో అంధకారం నింపుకొని బాహ్యంగా పూర్ణిమను జరుపుకుంటే ప్రయోజనం లేదు. అది పేరుకు పూర్ణిమయేకాని, అనుభవానికి చీకటే. మొట్టమొదట ప్రాకృత భావములనే చీకటిని దూరం గావించుకొని హృదయంలో దివ్యత్వమనే జ్యోతిని వెలిగించుకోవాలి. ఈనాడు మానవుని పట్టి పీడిస్తున్న గ్రహాలు రెండే రెండు. అవే రాగద్వేషాలు. అవే మానవుని పెడమార్గం పట్టిస్తున్నాయి. వాటిని వదిలించుకోవాలంటే ప్రేమను పెంచుకోవాలి.

*[తేది: 15.5.97న సాయిరమేశ్‌హాల్ (బృందావనం)లో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి]*

---

## శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,

ప్రశాంతినిలయం - 515 134 అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా
దిగుమతిదారు / ఎగుమతిదారు కోడ్ నెంబరు 0990001032
రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఎగుమతి దారుల కోడ్ నెంబరు. 2001198

**ప్రస్తుతం మా వద్ద లభ్యమవుతున్న పుస్తకముల జాబితా**

| వరుస నెంబరు | పేరు | ధర రూ.పై | వరుస నెంబరు | పేరు | ధర రూ.పై |
|---|---|---|---|---|---|
| 1. | ఉపనిషత్ వాహిని | 8-50 | 15. | సూత్ర వాహిని | 8-50 |
| 2. | గీతా వాహిని | 18-00 | 16. | అద్భుతమూర్తి | 37-00 |
| 3. | ధర్మ వాహిని | 8-50 | 17. | ఆత్మారామమ్ | 23-50 |
| 4. | ప్రశాంతి వాహిని | 11-00 | 18. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1978) | 18-00 |
| 5. | ప్రశ్నోత్తర వాహిని | 10-00 | 19. | నీలగిరి వేసవి వెన్నెల (1976) | 14-00 |
| 6. | భాగవత వాహిని | 18-00 | 20. | భజనావళి | 21-00 |
| 7. | రామకథారస వాహిని (1వ భాగం) | 17-50 | 21. | మనస్సు - మర్మము | 14-00 |
| 8. | రామకథారస వాహిని (2వ భాగం) | 18-00 | 22. | సందేహ నివారిణి | 10-50 |
| 9. | లీలాకైవల్య వాహిని | 4-50 | 23. | చిన్నకథ (1వ భాగం) | 17-00 |
| 10. | సత్యసాయి వాహిని | 14-00 | 24. | చిన్నకథ (2వ భాగం) | 18-00 |
| 11. | జ్ఞాన వాహిని | 11-00 | 25. | చిన్నకథ (3వ భాగం) | 12-00 |
| 12. | ధ్యాన వాహిని | 15-00 | 26. | సత్యం శివం సుందరం (1వ భాగం) | 40-00 |
| 13. | ప్రేమ వాహిని | 9-00 | 27. | సత్యం శివం సుందరం (2వ భాగం) | 43-00 |
| 14. | విద్యా వాహిని | 12-00 | 28. | సత్యం శివం సుందరం (3వ భాగం) | 38-00 |

27. సత్యం శివం సుందరం (2వ భాగం) 43-00
28. సత్యం శివం సుందరం (3వ భాగం) 38-00
29. సత్యం శివం సుందరం (4వ భాగం) 27-00
30. మణిమాల 20-00
31. వచనామృతము 18-50
32. షిరిడి నుండి పుట్టపర్తి 40-00
33. యుగావతారీ సాయిశా 25-00
34. శ్రీసత్యసాయి దివ్యబోధ (1993) 27-00
35. వాక్యవిభూతి 6-00
36. ప్రేమసుధా స్రవంతి 52-00
37. శ్రీసత్యసాయిగీతామృతము 46-00
38. సాయిబాటలో నా పయనము 55-50
39. ప్రబోధ పంచామృతము 15-00
40. సనాతన సారథి 70వ జన్మదిన ప్రత్యేకసంచిక 25-00
41. శ్రీసత్యసాయి గీతా 30-00
42. శ్రీకృష్ణుడు - శ్రీసత్యసాయి 28-00
43. సత్యసాయి సమర్పన 15-00
44. భక్తోద్ధారక శ్రీసత్యసాయి 28-00
45. హృదయ పుష్పాలు 15-00
46. పుష్పాంజలి 20-00
47. మూఢమతి - ముక్తమతి 23-50
48. పరీక్షునితో పంచ దశాబ్దాలు 27-00
49. శ్రీసత్యసాయి దివ్య లీలామృతము 15-00
50. ప్రేమజ్యోతి 45-00
51. మాతృశ్రీ ఈశ్వరమ్మ 44-00
52. భక్తి రసాయనం 18-00
53. జయభేరి 17-00
54. శ్రీసత్యసాయి విన్నపములు 17-00
55. పరమానంద శ్రీసాయి సన్నిధి 5-00
56. శ్రీసత్యసాయి అనుగ్రహం 5-00
57. మూలపురుషుడు శ్రీ సత్యసాయి 5-00
58. శ్రీసత్యసాయీశోపనిషత్ 5-00
59. గీతామకరందం 3-00
60. సౌందర్య కుసుమము 3-00

పుస్తకాలను రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పంపడం జరుగుతుంది. ***''కన్వీనర్, శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతి నిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా, పిన్-515134''*** అనే చిరునామాకు ముందుగా మీకు కావలసిన పుస్తకాల ధర ఇండియన్ లేక ఇంటర్నేషనల్ మనియార్డరు ద్వారాగాని, డ్రాఫ్ట్ ద్వారాగాని పంపిన మీదట మావద్ద లభ్యమౌతున్న పుస్తకాలను పంపుతాము. పుస్తకాలను వి.పి.పి. ద్వారా పంపించటం జరుగదు.

***పోస్టు ఖర్చుల వివరాలు (మన దేశంలో)*** : ప్రతి 100 గ్రాములకు 0-50 పైసల చొప్పున 3 నుండి 5 పుస్తకాలు (సుమారు ఒక కేజి బరువు గల ప్యాకెట్) పంపడానికి పోస్టు ఖర్చు - రూ.లు 5/-, రిజిస్ట్రేషన్ ఖర్చు రూ.లు 10/-; మొత్తం రూ.లు 15/-; 4 నుండి 8 పుస్తకాలు (సుమారు రెండు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 20/- ; 7 నుండి 10 పుస్తకాలు (సుమారు మూడు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 25/-; 9 నుండి 15 పుస్తకాలు (సుమారు నాలుగు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 30/-; 15 నుండి 20 పుస్తకాలు (సుమారు ఐదు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు 35/- అగును. ప్యాకింగ్ చేయుటకు పార్శిల్‌కు రూ.లు 20/-

***పోస్టు ఖర్చుల వివరాలు (విదేశాలకు)*** : 3 నుండి 5 పుస్తకములు (ఒక కిలో ప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 59/-; విమానంలో పంపడానికి : రూ.లు 209/-; 4 నుండి 8 పుస్తకములు (రెండు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 78/-; విమానంలో పంపడానికి: రూ.లు 378/-; 7 నుండి 10 పుస్తకములు (మూడు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 110/-; విమానంలో పంపడానికి: రూ.లు 560/-; 9 నుండి 15 పుస్తకములు (నాలుగుకిలోలప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 140-; విమానంలో పంపడానికి: రూ.లు 740/-; 14 నుండి 20 పుస్తకములు (ఐదు కిలోలప్యాకెట్) ఓడలో పంపడానికి: రూ.లు 172/-; విమానంలో పంపడానికి: రూ.లు 922/- అగును. ప్యాకింగ్‌చేయుటకు పార్శిల్‌కు రూ.లు 30/- *జంబోకార్గో కొరియర్ డోర్‌డెలివరీ డి.హెచ్.ఎల్.సర్వీసు* (10 కిలోల వరకు) : తూర్పుమధ్యదేశాలకు రూ.లు 2000/-; ఆసియా పసిఫిక్‌దేశాలకు రూ.లు 2500/-; యూరప్ మరియు యు.ఎస్.ఎ.లకు రూ.లు 3500/- ; ఇతర దేశాలకు రూ.లు 4500/- అగును. ప్రస్తుతపు విదేశీమారకపు రేట్లు: యు.ఎస్. $ = రూ.లు 34-00; కెనడియన్ $ = రూ.లు 25-00; యు.కె.పౌండు= రూ.లు 52-00